# న వ మా లి క

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి
( తెనాలి సంస్కృత కలాశాలా పూర్వాధ్యక్షుడు )

జయా పబ్లిషర్సు తెనాలి

 1948 [వెల 1-0-0

ఆప్తమిత్రులు

శ్రీ కోటంరాజు కృష్ణరావుకు

మంగళాశంసనములతో

సమర్పితము

*

# నవమాలిక

## ౧

రామశాస్త్రిభార్య ప్రసవవేదన పడుచుండెను. బయట నతని చెల్లెలు కమలయు, స్నేహితుడు చంద్రమౌళి శర్మయు మఱికొందఱు బంధువులును నిరుగు పొరుగు వారును నచటి యాచారము ననుసరించి శంఖములు జేగంటలు పట్టుకొని శుభవార్తకొఱ కెదురు చూచుచుండిరి. పుంశిశువు కలిగిన యెడల శంఖము లూదుటకును జేగంటలు ప్రయోగించుటకును కుతూహల పడుచుండిరి.

సూతికాగృహమునుండి శిశువు కరుణాకాకలీస్వరముతో తన ఆగమనవార్త ఘోషించినంతనే బయట నున్నవా రందఱు నుత్కర్ణులై నిశ్శబ్దముగా నిరీక్షింపసాగిరి. ఇంతలో, "ఏమి పిల్ల? మగపిల్లవాడే కదా!" అని కమల బిగ్గరగా ప్రశ్నించెను. "ఆడపిల్ల కాదు గదా!" అను ప్రశ్న ఆమె నాలుక చివరకు వచ్చి ఆగిపోయినది.

కొంత సేపటికి, "ఓహో! ఆడపిల్ల, ఆడపిల్ల! ఏ పిల్ల అయిననేమి లెండు! కుశలముగా నుండిన నదే పదివేలు!" అని సూతికాగృహమునుండి వినవచ్చెను. ఆవలికినది మంత్రసాని. ఆమె కంఠస్వరము సంతోషము ప్రకటించుటలేదు. ఆడపిల్ల అయినచో నామె ప్రాప్యము తక్కువయగును. ఆమె గొడవ ఆమెది!

కమల వదనము మలినమై ఉత్సాహ ముడిగిపోయెను. ఆడపిల్ల - ఆడపిల్ల! అని గొణగుకొనుచు లోనికిబోయి చేతిలోని జేగంట దేవమందిరమునకు తగిలించి వచ్చి యామె యొకమూల నిలుచుండెను. చంద్రమౌళి శంఖ మెత్తి దిక్కులు మారుమ్రోగునట్లు 'భుం భుం భుం' అని యూదెను. శంఖ ధ్వని యాగినంతనే శిశువు సస్ఫుటరోదనము వినవచ్చెను. చంద్రమౌళి శంఖ మూదుట మాని, "ఆడపిల్ల పుట్టినది కదా! మంచిది! నేను దానికి మహోత్సవముతో కళ్యాణము చేయుదును! నీవు జేగంట మ్రోగింపలేదేమి, కమలా! దాని పెండ్లికి నీవు పేరంటము చేయువా?" అని పలికెను.

కమల చిరునవ్వుతో, "అన్నయ్యా! ఆడపిల్ల పుట్టినదని నీమనస్సులో ఆవంతకూడ విచారము లేదా? మగపిల్లవాడు పుట్టియుండిన నీకెక్కువ సంతోషము కలిగెడిది కాదా" అనెను.

"ఊహూ! ఎంతమాత్రము కాదు. నేను నీవలె స్వార్థపరుడ ననుకొంటివా?" అనుచు చంద్రమౌళి మరల

శంఖము మ్రోగించెను. తరువాత కొంతసేపటి కతడు, "నేను పిల్లకు పేరుపెట్టెదను — చక్కనిపేరు పెట్టెదను!" అనుచు దీర్ఘముగా నాలోచింప నారంభించెను.

కమల ముందుకువచ్చి, "ఏమి పేరు పెట్టెదవు, అన్నయ్యా!" అని యడిగెను.

చంద్రమౌళి ఆలోచించుచు, "పేరా? చక్కనిపేరు-ముద్దులొలుకు పేరుపెట్టెదను!" అనెను. అతని మనస్సులో ననేక నామములు విద్యుల్లతలవలె మెరయ సాగినవి. కాని యతడొక్కదానిని గూడ నిశ్చయింపలేకుండెను.

కమల, "ఈలోపల నేనుపదిపేరులు పెట్టియుందును!" అని నవ్వెను.

చంద్రమౌళి మొగమెత్తి యూర్ధ్వదృష్టితో, "పేరుల కేమి భాగ్యము! ఎన్నోపేరులు మనసులోనికి వచ్చినవి. కాని దానికి తగినపేరు - నాకు నచ్చినపేరు - ఆ దొరకినది - మంచిపేరు - దానిపేరు నవమాలిక!" అని సంతోషముతో పలికెను.

కమల ముసిముసి నవ్వులు నవ్వుచు, "బలే, బలే! కవీశ్వరులు పెట్టుపేరు పెట్టినావు! మా అన్నయ్య కవిత్వము గూడ చెప్పునని నాకు తెలియదు సుమా! ఇదిగో, అన్నయ్యా! ఈ సారి నీకు కూతురు పుట్టిన 'గన్నేరు మొగ్గ' అనిపేరు పెట్టెదను!" అని పకపక నవ్వెను.

"పుట్టని బిడ్డలకు పేరు లెందుకులే! ముందు నవ మాలికకు కళ్యాణము కానిమ్ము!" అనుచు చంద్రమౌళి శంఖ మూదెను.

౨

రామశాస్త్రి బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణుడై అయిదు సంవత్సరములైనది. బి ఇడి పరీక్ష కూడ పూర్తి చేసి నేటికి నాలుగు సంవత్సరములనుండి అప్పుడపుడు 'కమిటీ' పాఠశాల లలో నత డుపాధ్యాయుడుగా పని చేయుచుండెను. కమిటీ పాఠశాలలం దెన్ని వత్సరములు పనిచేసినను ఆతని యుద్యోగము స్థిరపడలేదు. ఇపుడు కాకినాడలో పిఠాపురము రాజా వారి కాలేజీ హైస్కూలులో 'హెడ్ మాష్టరు' పదవికై నిరీక్షించుచున్నాడు.

నాటి టపాలో రామశాస్త్రికి రెండు కవరులు వచ్చినవి. వానిలో స్వగృహమునుండి వచ్చిన యుత్తరమును గుర్తించి కవరు చించి ఇట్లు చదివెను :

"అన్నయ్యకు నమస్కారములు!

నిన్న ఉదయము 8-30 గంటలకు లక్ష్మీనమానురాలగు వదిన సుఖముగా ప్రసవించినది. నీకు కన్యారత్నము జనించినది. చంద్రమౌళి అన్నయ్య దానికి 'నవమాలిక' అని పేరుపెట్టినాడు పిల్ల అచ్చముగా నీపోలిక. తల్లియు పిల్లయు కుశలముగా నున్నారు.

నీ ప్రియ సోదరి
కమల."

రెండవ యుత్తరము పాఠశాలాధికారి వద్దనుండి వచ్చినది. అందు అతనిని హెడ్‌మాష్టరు పదవియందు నియమించినట్లును వెంటనే యుద్యోగములో ప్రవేశింపవలసినట్లును కలదు.

ఈ యుద్యోగము కొఱకే నేటికి మూడు మాసములనుండి అతడు ప్రయత్నించుచుండెను. నేడు పుత్రికా శుభోదయమును ఈప్సితార్థప్రాప్తియు నేకకాలమున దెలియుటచే నతని హృదయము మా సంతోషములను భరింపలేకపోయెను.

హర్షోత్ఫుల్ల హృదయముతో పులకాంకురిత శరీరముతో కంపితహస్తములతో నతడా లేఖల రెంటిని మాటిమాటికి చదివికొని ఆర్ద్రీనయనములతో తలయెత్తి చూచెను. ఎదుట నున్న యుద్యానమున కుసుమితతరువులు తమ శోభాహాసములతో నతని నభినందించెను. వృక్షశ్రేణుల నడుమ నున్న మార్గమందు నిలునుండి యా నవాగతశిశువు పవిత్ర గంగా ప్రవాహము ముక్తికి మార్గము చూపించునట్లు అతని భవిష్యజ్జీవిత సుఖమునకు మార్గము చూపించుచున్నట్లుండెను ఉదయభాను ప్రభలతో ప్రదీపించు నాకాశమువంక జూచి పరమేశ్వరు నుద్దేశించి చేతులు జోడించి తచ్చరణకమలములను తన ఆర్ద్రనేత్రములతో స్పృశించుచున్నట్లు భ భావముతో నతడు శిరమువంచెను. తరువాత కమలకు ప్రత్యుత్తరము వ్రాసి, తన కృతజ్ఞతను తెలుపుటకై యాతడు కలాశాలాధ్యక్షుని గృహమున కరిగెను.

నాలుగు దినములైన పిదప చంద్రమౌళిశర్మ వద్ద నుండి అతనికి ఉత్తరము వచ్చెను :

"అన్నగారికి నమస్కృతులు.

ఈమధ్యాహ్నమే నేనిచటికి వచ్చితిని. నవమాలికయు వదినె గారును సుఖముగా నున్నారు. విన్నారా, కమల ఏమి చేసినదో! నవమాలిక జనించినపుడు ఆమె జేగంట మ్రోగింపలేదు. కారణము ఆడపిల్లయని. ఆడపిల్లయు మగ పిల్లవాడును సమానము కాదు కాబోలు! నవమాలిక శుభో దయమైనంతనే మీకు స్థిరమైన యుద్యోగము లభించినది గదా! మీ ప్రియకుమారి వివాహము నిమిత్తము ఇప్పటి నుండియే పైకము నిలువచేయుడు. మహావైభవముగా మనము నవమాలికకు కళ్యాణము సలుపవలయును.

మీ ప్రియ సోదరుడు
చంద్రమౌళి శర్మ."

చంద్రమౌళి కమలపై మోపిన నేరమును, కుమారి వివాహ విషయమున జేసిన సూచనయు జదివికొని రామ శాస్త్రి లోలోపల నవ్వుకొనెను. అల్లుర కట్నముల కొనము కన్యాదాత లెట్టి తలవంపులకు లోనగుచున్నదియు, వివాహా నంతరము ఎట్టి కడగండ్ల పాలగుచున్నదియు అతడు లోక ములో చూచుచునే యున్నాడు. అందుచే నత డానాటి నుండి తనకు వచ్చు వేతనమునుండి కొంత భాగము తన

కుమారి వివాహము నిమిత్తము నిలువ చేయవలయునని నిశ్చయించుకొనెను. గొప్ప కట్న మిచ్చియైనను నవమాలికకు గొప్ప సంబంధము సంపాదించుటలో నెట్టి యాభ్యంతరము కలుగ గూడ దని నిర్ణయించుకొనెను.

మొదటి నెల జీతము రాగానే కొంత యింటికి పంపి మిగిలిన దానిలో మూడు పదిరూపాయల నోట్లు తీసి చక్కని కాగితపు సంచిలో నుంచి, సంచి మీద పెద్దపెద్ద యక్షరములతో నెఱ్ఱ సిరాతో "నవమాలిక కళ్యాణము నిమిత్తము" అని వ్రాసి, ఆ బిడ్డ పుట్టిన తారీఖు వేసి, పట్టుకుమాలు చుట్టి, దంతపు బరణియందుంచి దానిని తన ఖజానా పెట్టెలో పెట్టి తాళము వేసెను.

## 3

ఆరు మాసములు గడచినవి. కమల అత్తవారింటికి వెళ్లినది. రామశాస్త్రి స్వగృహమునకువచ్చి జానకిని నవమాలికను కాకినాడకు తీసికొనిపోయెను.

నవమాలిక సంధ్యావర్త పుష్పమువలె నతికోమలముగా నతి మనోహరముగా పెరుగుచుండెను. శరన్నీలాకాశమున శుభ్రజలద శకలమువలె నాబిడ్డ విలాసము వెలార్చుచుండెను. ఆమె నిర్మలానందమయ నేత్రములవంక జూచి రామశాస్త్రి అనురపుణ్యచ్ఛాయ లందు ప్రతిఫలించిన వని భావించుచుండును. పరమేశ్వరానుగ్రహ మా శిశువుగా

మూర్తీభవించిన దని ఆనందించుచుండును. ఆ శిశువును సప్రేమముగా హృదయమునకు హత్తుకొనుచుండును. ఆమె నీలాలకలు సాదరముగా దువ్వుచుండును. దివ్యశోభావిభాసితమైన ఆమె చిన్ని మొగమును కుసుమకోమలములైన కపోలములను ముద్దాడుచుండును. ఆమె కరచరణ లీలాలాలిత్యము నేత్రపర్వముగ వీక్షించుచుండును. ఆమె క్రీడాకాకలీ స్వరములు వీనులార గ్రోలుచుండును. ఆమె మధురోజ్జ్వల మందహాసముల కెంతో మురియుచుండును. ఆమె కోమలస్పర్శచే నతని శరీరము పరవశ మగుచుండును.

ఈ రీతిగా రామశాస్త్రి హృదయము వాత్సల్యమమకారములతో పొంగి పొరలుచుండెను. నడుమ నడుమ అతడిట్లు భావించుచుండెను: "ఈ తరుణ గార్హస్థ్యజీవితములో పరమేశ్వరుడు నాకీ నవమాలికను ప్రసాదింపకున్న నా దినములెట్లు గడచెడివో! ఈ చిన్నబిడ్డ లేకున్న ఒక్క ముహూర్తము గూడ జరుగునట్లు లేదే! ఇపు డీమహానందానుభూతిలో నిమేషములవలె తేలిపోవుచున్న నా రోజులు ఈ బంగరుబొమ్మ లభింపకున్న ఎంత వైచిత్ర్య విహీనములుగా, ఎంత సంతోషరహితములుగా, దుర్భరములుగా నుండెడివో!"

రామశాస్త్రి సంసారములోని సర్వసుఖములకు సకలానందములకు సమస్తాకాంక్షలకు నవమాలిక కేంద్రస్థానమై వెలయుచున్నది. ఎట్టి స్థితియందును ఏనిముసమందును ఆమెను విస్మరింప వీలులేదు. ఆతలిదండ్రుల హృదయాంతరములలో

దివారాత్రము లాపసికూన కోమలసుఖస్మృతివలె మెలగు చుండెను. వారి జీవితము మహోత్సాహముతో నానంద వాహినిలో దేలిపోవుచుండెను.

రెండు సంవత్సరములు కడచినవి. నవమాలిక ముద్దు ముద్దుగా నడువసాగినది. క్రీడావిశేషములతో నిల్లంతయు దిరుగనారంభించినది. మనోజ్ఞముగా మాటాడ దొడగినది. పద్యఖండములు గేయచరణములు పాడ నేర్చినది. నోటబట్టియు పట్టకయు ఒకప్పుడు 'దైవతంబు కుమారీ!' అనియు, ఇంకొ కప్పుడు 'నిజముగ కృష్ణా!' అనియు, మరియొకప్పుడు 'వినరా సుమతీ!' అనియు రాగము తీయుచుండును. వెన్నెల రాత్రులందు చంద్రుడు కనబడినంత నే 'చందమామ రావే జాబిల్లి రావే కొండెక్కి రావే' అని చిన్నిచేతు లూగించుచు పాడుచుండును. గుమ్మటమువలె గిఱ్ఱున తిరుగుచుండును. గిన్నెలు చెంబులు మొదలగునవి బోరగించుచుండును. మూాల నున్న వస్తువులు ముంగిట బెట్టుచుండును.

అట్టి సమయములం దాదంపతు లాబిడ్డ నెత్తుకొని ఆమెపై ముద్దులు కురిపించుచుందురు. పైకెత్తి అటువంచి యిటువంచి ఆనందించుచుందురు. హృదయమునకు హత్తు కొని లాలించుచుందురు. ఏదో అడిగి ఆబిడ్డ వచ్చియు రాని ముద్దు మాటలతో ప్రత్యుత్తరములు చెప్పుచుండ విని సంతోషించుచుందురు. చెప్పలేక చిన్నినోరు తెరచి విలక్షణ ముగా జూచునపు డామె ఆర్ద్రవదనము ముద్దాడు చుందురు. చక్కిలిగిలి, పెట్టి కిలకిల నవ్వించి నవ్వుచుందురు.

ఈవిధముగా నాజాయాపతుల జీవితము సుఖపార వశ్యముతో గాలిపటమువలె తేలిపోవుచుండెను. వారి సమస్త జీవిత మాధుర్యమునకును ఆయువు పట్టు అయినది ఆ పసిపాప!

౪

"సుఖముగా ప్రసవించి సురక్షితముగా నుండిన అయిదేండ్లు నిండక పూర్వము శిశువు తలనీలాలు ఇచ్చెదను" అని జానకి సింహాచల నృసింహాస్వామికి మ్రొక్కుకొని యుండెను. ఇక నెలదినములకు నవమాలికకు అయిదేండ్లు నిండును.

వేసవి సెలవులు. రామశాస్త్రి సకుటుంబముగా సింహాచలము పోవుటకు సంకల్పించుకొని చెల్లెలిని పంపవలసినదని మరదికి ఉత్తరము వ్రాసెను అత్తగారి యనుజ్ఞ వడసి కమల అన్నగారి యింటికి వచ్చెను. అందరును గలసి సింహాచలము వెళ్లిరి.

సింహాచలమున కొకమైలు దూరములో యాత్రికులు విడియుటకు వసతులున్నవి. వానికి సమీపమున నడవియు కొండలును గలవు. సింహాచలము చేరి వారు మకాందు బస యేర్పరచుకొని తరువాత నవమాలికకు ముందు కొండిజడయు వెనుక జారు జడయువేసి పూవులు చుట్టి, ఫోటోగ్రాఫులు

తీయించిరి. పిదప వా రామెను స్వామి సన్నిధికి గొనిపోయి, ముస్తుందు జడలు కత్తిరించి పిమ్మట వెండ్రుకలు తీయించిరి. రామశాస్త్రి ముందరిజడలో కొంచెము భాగము కత్తిరించి కొమార్తె బాల్యస్మృతి చిహ్నముగా దాచికొనెను. పిదప వారందరు బసకు వచ్చి భోజనముచేసి పండుకొనిరి. మార్గాయాసమున మిక్కిలి బడలియుండుటచే వారికి గాఢముగా నిద్రపట్టెను.

నవమాలికకు నిదుర రాలేదు. మెల్లగా తల్లిప్రక్కనుండి లేచివచ్చి వసారాలో గూర్చుండి అమె "అప్పల నరసింహా, అప్పల నరసింహా!" అని పాడుచు బొమ్మలతో నాడుకొనుచుండెను. ఆమె మెడలో రెండు పేటల చంద్రహారము, చేతులకు బంగారు గాజులు, సందిట కెంపుల దండకడియములు, ముక్కుకు బంగరు గజ్జల ముక్కుతాడు కాళ్లకు గజ్జల గొలుసులు కలవు. ఆమె కదలినపుడెల్ల అవి యన్నియు తళతళలీనుచుండెను.

వైశాఖమాసము. మధ్యాహ్నసమయము ఎండనిప్పులు చెరుగుచుండెను. ఆకు అల్లాడుటలేదు, పర్ణచ్ఛాయల డాగి పక్షులు గూడ కనుమోడ్చుచుండెను. ఎచ్చటను మనుష్య సంచారము లేదు. ఆ సమయమున పంచదార చిలుకలమ్ముకొను ఒక డాగృహమున కించుక దూరములో నున్న వృక్షము క్రింద విశ్రమింపవచ్చి బడలిక దీర్చుకొనుచుండ నతని దృష్టి నవమాలిక మీద బ్రాలెను. ఆబిడ్డ శరీరము

మీఁది సువర్ణాభరణము లతని కనులలో మిరుమిట్లు గొల్పినవి. తోడనే అతని హృదయములో దురాశ లంకురించినవి, దురుద్దేశములు చిగిర్చినవి, దుస్సాహసము తీగెలు సాగినది. అప్పు డత డటు నిటు పరికించి చూచెను. ఎచ్చటను ప్రాణి సంచారము కనిపించ లేదు. వెంటనే చిలుకల బుట్టతో నత డాబిడ్డ వద్దకు వచ్చెను.

పంచదార చిలుకలను జూచినంతనే నవమాలిక ఆడుకొనుట మాని లేచి యతని కడకు పోయెను. ఆత డామెకు పంచదారచిలుక లిచ్చుచు లాలన జేసి మెల్లమెల్లగా నింటి చాటుకు తీసికొనిపోయి ఉన్నట్లుండి గబుక్కున ఆమె నోట గుడ్డలు గ్రుక్కి దుప్పటి ముసుగు వేసి ఎత్తుకొని అడవి లోనికి వేగముగా పారిపోయెను.

కొంత సేపటికి మెలకువవచ్చి రామశాస్త్రి నవమాలిక కోసము చూచెను. తల్లిప్రక్కలో నామె కనబడలేదు. అతడు వసారాలోనికి వచ్చిచూచెను. అచట గూడ నామె యగపడలేదు. అంత నతడు తొట్రుపాటుతో నలుదెసలు వెదకుచు భయకంపిత స్వరముతో బిగ్గరగా 'నవమాలికా!' అని కేకవైచెను. ఆ కేక కందరు ఉలికిపడి లేచి గబగబ బయటికి వచ్చిరి. కాళ్లు తడబడ, గుండెలు దడదడ కొట్టుకొన, నాలుక లెండ, కన్నీరు కార్చుచు, డగ్గుత్తికతో, వికారస్వరముతో 'నవమాలికా!' అని కేకలు పెట్టుచు అందరును గలిసి ఆ బాలికకోసము వెదక నారంభించిరి. ప్రక్క యిండ్లవారి

నడిగిరి. బాటసారులను ప్రశ్నించిరి. ఆసంగతి తెలిసినంతనే ప్రక్క యిండ్లవారును బాటసారులును నానాముఖముల అరణ్యములో దూరి గుంటలు మిట్టలు పొదలు బయళ్లు గాలించిరి. కొందరింకొకవైపునకును, మరికొందరు మరియొక వైపునకును బోయి ఆప్రదేశమంతయు కలయ వెదకిరి. ఎచ్చటను నవమాలికజాడకనిపించలేదు. వెదకివేసారిని రాశాహృదయులై చివరకు ఏదుర్మార్గుడో నగలకోసమాసపడి బిడ్డ నెత్తుకొనిపోయి చంపి ఎచటనో పారవేసియుండునని వారు నిశ్చయించుకొనిరి. వారు ఆ నిర్ణయమునకు వచ్చినంతనే రామశాస్త్రి గుప్పున కూలబడి కుమిలి కుమిలి విలపింపదొడగెను. జానకి నేలపై బడి కన్నీరు కాలువలు గట్ట దుఃఖింపజొచ్చెను. కమల పెద్ద పెట్టున నేడువసాగెను. చుట్టుప్రక్కలవారందరు కడుపు తరుగుకొనిపోవు వారి దుఃఖమునకు మిక్కిలి విచారపడిరి. కొందరు వారి నూరడింప యత్నించిరి. కాని ప్రయోజనము కలుగలేదు.

౨

తన జీవితములో నిట్టి దుర్ముహూర్తము వచ్చునని రామశాస్త్రి స్వప్నమున గూడ తలచియుండలేదు. ఆనంద వీచికలలో మైమరచియున్న యతనిపై నాకస్మికముగ పిడుగు పడినట్లైనది. క్షణకాలములో నా దంపతుల సుఖశాంతులు

శూన్యములైనవి. వారి ఆనంద దాయిని అంతరించినది. వారి మాలతీ కోరకము శుభోదర్కముగా విచ్చి శోభావరి మళిములు వెదజల్లుచుండ మృత్యువు దానిని రెప్పపాటులో త్రెంచి యెగజిమ్మినది. అంధకార ప్రాయములైన హృదయ కుహరములలో సువర్ణపాత్రికలందు వెలిగించుకొనిన వారి ఆనంద జ్యోతి ప్రళయవాతాహతమై చటుకున చల్లారిపోయి నది. ఆహా! విధి ఎంత నిష్ఠురమైనది, ఎంత నిష్కరుణ మైనది! ఆ దంపతుల హృదయకోశములను నులిమి వేసినది. వారి మనస్సుల కాద్యంతరహితమైన అశాంతి రగులుకొల్పి నది. వారి హృదయాంతరములందు అంతరాయము లేని ఆలాతమును ప్రజ్వలింపజేసినది.

సంసారగమన మప్రతిహతము. అందలి కార్యము లని వార్యములు. నవమాలిక గతించినది. అప్పటివలెనే దినము లకు దినములు జరిగిపోవుచున్నవి. కార్యావసరములు కలుగు చున్నవి. కలిగి నిర్వర్తితము లగుచున్నవి. అన్నియు నప్పటి వలెనే వచ్చిపోవుచున్నవి. కాని యీ కొలది సంవత్సరముల నుండి ఏది సంతోష తరంగములం దూగించినదో, సుఖ పారవశ్యమున జోకొట్టినదో అది మాత్రము తిరిగి రాలేదు. అది ఏలోకమున కేగినదో? ఎచట వ్యధలు విచ్ఛేదములు కలుగవో, విషాదజ్వాలలు ప్రజ్వరిల్లింపవో అట్టి అమర్త్యలోక మున కరిగినదా! ఈ మర్త్యలోకమునకిక రాదా! ఏమో!

## ౬

సెలవులు పూర్తి కాగానే రామశాస్త్రి కాకినాడకు వచ్చెను. మాసాంతమున వేతనము తీసికొనినంతనే అతని కనుల నీరు గ్రమ్మెను. బాష్పజడీభూత దృష్టితో గృహమున కరుగుచుండ నతనికి మార్గము గోచరింపలేదు. ఇంటికి వచ్చి, యతడు మంచముమీద ముడుచుకొని పండుకొని, దిండు గుండెల కదుముకొని విచారపడసాగెను. హృదయమంతయు నతనికి గొప్ప బరువుగా గనబడ దొడగెను. దిండుతో నెంతగా నదుముకొన్నను గుండెదడ తగ్గలేదు.

నేడతనికి వేతనము వచ్చినది. ఉద్యోగములో ప్రవేశించినది మొదలు ప్రతిమాసము మొట్టమొదట ముప్పది రూపాయలు తీసి నవమాలికా వివాహము నిమిత్తము సంచిలో నుంచి పట్టురుమాలు చుట్టి పెట్టెలో పెట్టుచుండువాడు. నేడు ఎవరి వివాహము కోసము అతడు పైకము నిలువ చేయవలయును! తన కుమారి కళ్యాణమునకా? కాదు. అందువలన ప్రయోజనము లేదు. ఎందులకు లేదు!

నవమాలిక గతించినది. ఇపుడామె వివాహ విషయమాలోచింప నవసరము లేదు. అ ప్రేమమూర్తి – ఆ నయనామృతవర్షిణి ఎచటికి బోయినదో! ఏమైపోయినదో! అయినను ఆమె కళ్యాణముకోసము ఇక ధనసంచయ మనవసరము లేదని నిర్మమభావముతో నూరకుండవచ్చునా? మరి

నేటికి అయిదేండ్లనుండి కూడబెట్టిన పైక మేమి చేయవలెను. దానితో మాత్ర మిక ప్రయోజన మేమి? ఆధనము కార్యాంతరమునకై వినియోగించుటకు రామశాస్త్రి హృదయము ఎంతమాత్రము అంగీకరించుటలేదు. అతడు అన్యథా వినియోగింపలేదు. ఆయాలోచనము మనస్సునకు తగిలినంతనే అతని హృదయములో తీవ్రమైన వేదన—అవ్యక్తమైన సంక్షోభము అనుభూతము కాదొడగెను.

తరువాత కొంతసేపటికి సంబాళించుకొని కన్నీరు తుడిచికొని రామశాస్త్రి లేచి కూర్చుండెను. అతని తలగడవైపున చిన్నపెట్టె కలదు. కంపితహస్తములతో నతడాపెట్టె తెరచెను. అందు శిల్పరచనా వైచిత్ర్యముగల దంతపుబరిణె కలదు. అందులో పట్టురుమాలు చుట్టిన సంచియున్నది. ఆ సంచిమీాద ఎఱ్ఱసిరాతో నవమాలిక పేరును ఆమె జన్మదినమును వ్రాసియున్నవి. ఆసంచిలో నవమాలిక వేణీభాగమును పదిరూపాయల నోట్లును గలవు.

వానిని బయటికి దీసి రామశాస్త్రి వణకు చేతులతో హృదయమునకు హత్తుకొనెను. అతని కనులనుండి అప్రయత్నముగా అశ్రుబిందువులు జారి కపోలములపై ప్రవహించెను. "ఈశ్వరా! నవమాలికను హృదయమునకు హత్తుకొని యిక ఆనందింపలేనుగదా! ఆమె ముద్దు మొగముపై అందము లొలికిన యీా ముంగురులతో చిత్తశాంతి నొందుమని నా నొసట వ్రాసితివా, ప్రభూ!" అని యతడు విలపించెను.

పిదప నతడు ఆ కేశగుచ్ఛము సంచిలో భద్రపరచి, జేబులోనుండి డబ్బుసంచితీసి, ఆనాడు వచ్చిన జీతము సొమ్ము నుండి మూడు పదిరూపాయల నోట్లు సంచిలో నుంచెను. ఆసమయమున తొట్రుపడు పదములతో జానకి యచటికి వచ్చెను. అతడు తలయెత్తిచూచెను. అమెవదనమున నేదియో యస్వాభావిక వికారము ప్రకటితమగుచుండెను. రామశాస్త్రి గద్గదకంఠముతో వికృతస్వరముతో, "జానకీ! నవమాలిక కళ్యాణముకోసము ధనము కూడబెట్టుచున్నాను" అనెను. జానకి మూర్ఛనొందినట్లు శయ్యాపార్శ్వమునకువచ్చి అతని హృదయమున వ్రాలి వెక్కి వెక్కి యేడువసాగెను.

౭

మూడు సంవత్సరములు గడచినవి. ఎవ్వరెట్టి స్థితిలో నున్నను కాలము నిరాటంకముగా జరిగిపోవుచుండును. రామశాస్త్రికి గూడ దినము లెట్లో దాటిపోవుచున్నవి. కాని యింత కాలము గడచినను అతని హృదయవేదన యుపశమింపలేదు. అది యే మూలలనో దాగియుండి కలక వేయుచునే యుండెను. ఆ జ్వాల యతని దైనందిన జీవితము నావరించి ప్రతిక్షణము తలయెత్తుచునే యుండెను. ఆ వ్యథ అతని మనస్సులో శాశ్వతముగా పాదుకొనిపోయినది. ఏవిధముగను అతడు దానిని విస్మరింపలేకుండెను. ఆ నయనానంద

దాయుని - భూలోకములో నున్నదో స్వర్గమం దున్నదో - అతని ప్రేమరాజ్యమునకు అకుంఠిత భావముతో శాశ్వతాధి కారిణి అయినది. విధి నిష్కారుణముగా వ్యవధానము కలిగించినను అతడు కుమారీమమకారము మరచిపోలేదు.

కోటుకు లోపలివైపున జేబు కుట్టించి, అందు పది రూపాయల నోట్లును కుమారి కేశగుచ్ఛమును గల సంచి నుంచి రామశాస్త్రి భద్రముగా కాపాడుకొనుచుండెను. అతడెట్టి కార్యములందు నిమగ్నుడై యుండినను దాని స్పర్శ యతని ప్రియపుత్రిక పవిత్రస్మృతిని మేలుకొలుపుచుండెను. అతని జీవితములోని సమస్త చింతా ప్రవంతుల యడుగున అంతర్వాహినిగా కుమారీ ప్రేమస్మృతి అవిచ్ఛిన్నగతితో ప్రవహించుచునే యుండెను.



మరి రెండు సంవత్సరములు గడచినవి. వేసవి సెలవులకు రామశాస్త్రి స్వగృహమునకు వచ్చెను. నేడు టపాలో అతనికి శుభలేఖ వచ్చినది. దానిమీద 'వివాహ మహోత్సవ శుభాహ్వానము' అనిఉన్నది. ఆహ్వానించినది చంద్రమౌళిశర్మ.

చంద్రమౌళిశర్మయు రామశాస్త్రియు బంధువులు కారు. కాని చిన్నతనమునుండియు వారిరువురు ఒక్కగదిలో

నుండి, ఒక్కబసలో భోజనము చేయుచు, ఒక్కతరగతియందు గూడ విడిపోకుండ బి. ఏ వరకు ఒక్కపాఠశాలలో చదివి కొనిన ప్రాణమిత్రులు. అందుచే వారికి బాంధవ్యముకన్న మిన్నయగు నన్యోన్యానురాగ మేర్పడినది. ఇపుడు చంద్ర మౌళి తన కూతురు సుశీల వివాహమునకు రావలసినదని రామశాస్త్రి కాహ్వాన మంపినాడు.

రామశాస్త్రి శుభలేఖ చదివికొని, "ఇపుడు సెలవులే కదా! చేయవలసిన పనిపాటులుకూడ కనబడలేదు. వెళ్లి నాలు గైదు దినములుండి వివాహము చూచి వచ్చెదను" అనుకొని లోనికి బోయి తన సంకల్పము జానకి కెరిగించి ఆ సాయం కాలము ప్రయాణ మగుటకు సిద్ధపడసాగెను.

బయలుదేరు సమయమున జానకి యతని చేతికి కాగిత మిచ్చెను. అత డామెవంక జూచి, 'ఇది యేమి?' అని యడిగెను. "తీసికొని రావలసిన వస్తువుల జాబితా" అని జానకి యనెను. అప్పు డామె కేమి జ్ఞాపకము వచ్చెనో యేమో, ఆమె నేత్రములు బాష్పాక్రాంతము లయ్యెను. రామశాస్త్రి కాగితము జేబులో నుంచికొని, ఆమె శిరము తన హృదయమున కానించుకొని, కపోలములు దువ్వుచు నామె నూరడించెను.

రామశాస్త్రి వెళ్లిన తరువాత చాల సేపటివరకు జానకి యతడు పోయిన మార్గమువంక జూచుచు నిలుచుండెను. ఆమె నయనములనుండి యశ్రువు లల్లే యురలుచుండెను.

ఆ సమయమున నామెకు నవమాలిక కళ్యాణవిషయము జ్ఞప్తికి వచ్చినదా ? కాక, "అంధకారప్రాయముగా నున్న నా జీవితములో ఆనంద జ్యోతి నెవుడు వెలిగింతువు, తండ్రీ !" అని దయామయుడగు భగవంతుని ప్రార్థించినదా !



కౌమార్తె వివాహమునకు చంద్రమౌళిశర్మ సకల ప్రయత్నములు చేయ నారంభించెను.

చంద్రమౌళి సామాన్యగృహస్థు. ఎక్కువ ఆస్తికల వాడు కాదు. వరాన్వేషణమునకై బయలుదేరి కొలదిలో మంచి సంబంధమున్నదని తెలిసిన ప్రతి ప్రదేశమునకును బోయి విచారించెను. ఎచటికి వెళ్లి విచారించినను అయిదు వేలు పదివేలు కట్నము లిమ్మని కోరుచుండిరి. చదువుగల వానికి ఆస్తి యుండదు. ఆస్తియున్నవానికి విద్యయుండదు. రెండును గల చోట సంప్రదాయ ముండదు. మూడును వెలసినచోట కట్నము పదివేలు, పాతికవేలు !

పాపము, చంద్రమౌళి తిరిగి తిరిగి విసిగి వేసారి, "ఈశ్వరా ! ఆడపిల్ల ననుగ్రహించి నన్నిట్లు శిక్షించుచున్నావా ! స్త్రీ శిశువు అంత మహాపరాధమా, మహాప్రభూ ! నాయపరాధమునకు – నాపాపమునకు వేరొకశిక్ష విధింపరాదా, దయామయా!" అని లోలోపల సంక్షోభింప జొచ్చెను.

## ౧౦

విజయనగరములో బి. ఏ. చదువుచున్న విద్యార్థులు కొందరు సంఘముగా నేర్పడి కన్యాదాతలు పడుచున్న కడగండ్లు విచారించి కట్నముల కార్చిచ్చు చల్లార్ప సమకట్టి సభ చేసిరి. అందు ముఖ్యుడు శ్రీధరశాస్త్రి. ఆ సభలో నత డిట్లు గంభీరముగా నుపన్యసించెను.

“సోదరులారా! మానవజాతికి వివాహ మనునది మహా పవిత్ర ధర్మము. మనుష్య జీవితములో స్త్రీపురుషు లిరువురును సమప్రధానులు. అతీంద్రియద్రష్టలగు మన పూర్వులు ఐహికాముష్మిక సుఖ ప్రాప్తికి ఈ వివాహ యజ్ఞము నెంత పవిత్ర సాధనముగా నుద్దేశించిరో అది యిపుడు భ్రష్టమైనది. అందుచేతనే మన మింత నిర్వీర్యులమై మన కర్తవ్యములు నిర్వర్తించుటకు — మానవధర్మము రక్షించుటకు అసమర్థుల మైతిమి. మానవాశయములు మరచితిమి. నేటి వివాహములు విలాసప్రధానములైనవి — కన్యావర విక్రయములకు విపణి వీధులైనవి, బొమ్మల పెండ్లిండ్లవలె ఉత్సవప్రాయములైనవి. కారణములు కనిపెట్టి కారకులను నిందించి ప్రయోజనము లేదు. మన మందరము గలిసి కార్యశూరులమై సర్వానర్థములకును హేతుభూతమైన ఈ దురాచారము దూరీకృతము చేయవలెను. దావాగ్నివలె చెలరేగి సంఘమును సాంఘిక ధర్మములను దహించుచున్న

యీ కన్యావరశుల్కములను రూపుమాపుట మన కర్తవ్యము. తాత్కాలికమైన ఆర్థికలాభము నుపేక్షించి, దురాశాదగ్ధులమై, పశువిలాసములకు లోనై మానవధర్మమును — సకల శ్రేయములకు నిదానమైన మన ప్రాచీన పవిత్ర ధర్మమును ఉద్ధరించుటకు మనము బద్ధకంకణులము కావలయును!”

సభాసదులందరు కట్నములు గ్రహింపరాదని ఏక గ్రీవముగా శపథములు చేసిరి.

౧౧

ఈ సంగతి విని, శ్రీధరశాస్త్రి తన కుమారికి తగిన వరుడనుకొని, అతని తండ్రియగు వేంకటేశ్వర సోమయాజి వద్దకు వెళ్లి చంద్రమౌళి తన సంకల్పము నెరిగించెను.

సోమయాజి పేరుపొందిన న్యాయవాది. అతనికి మాసమున కయిదారువందల రూపాయలు ఆదాయము వచ్చును. భూములపై సంవత్సరమునకు మూడువేల రూపాయలు వచ్చును. అతని యాకారము చూచిన సనాతన ధర్మము మూర్తీభవించినట్లుండును. ఆయన శాంతముగా చమత్కారముగా మృదువుగా మధురముగా మాటలు చెప్పు చుండును.

సోమయాజి కట్నము లేనిది ఘనత లేదను మతము కలవాడు. అతడు కొంతసేపు దీర్ఘముగా నాలోచించి

నట్లభినయించి లౌకికచమత్కృతి బయలుపడకుండ నుతి మెత్తని పలుకులతో నిట్లనెను: "మా పిల్లవాడు బి. ఏ. పరీక్షయందు తీర్ణుడైన తరువాతగాని వివాహవిషయము తలపెట్ట దలపలేదు. 'ఇంటర్మీడియట్' చదువుచుండగా వానికి నాలుగువేలు కట్న మిచ్చెదమని వచ్చినారు. క్రిందటి సంవత్సరము అయిదువేలు ఇత్తుమని ఎందరో వచ్చినారు. అంతయెందులకు - నెలరోజులక్రిందట వెంకటావధానులు గారట - రామవరమని చెప్పిన జ్ఞాపకము - ఇంటిపేరు - ఇంటిపేరు - నోటిలో నాడుచున్నది - ఆయన ఆరువేలు ఇచ్చెదనని ఎంతో ప్రాధేయపడినాడు. కట్నముల కేమి లెండు! కట్నములవలన కలకాలము జీవితము గడవ గలదా? ఏదో లోకాచారము ననుసరించి అంగీకరించు టయేగాని నాదృష్టి మాత్రము గౌరవము, సంప్రదాయము- ఇట్టివానిమీదనే యుండును. ధనము ఎంతవచ్చినను సత్సంప్రదాయము దొరకుట దుర్లభముగదా! అయినను చదువు పూర్తికావలయునను నిర్ణయముతో నే నెవ్వరికిని ఎట్టి మాటయు నీయలేదు. ఇపుడు మీరు గొప్పవారు వచ్చినారు! ఏమి సమాధానము చెప్పవలయునో తోచుటలేదు!"

చంద్రమౌళి నివ్వెరపోయెను. కొంతసేపటికి ధైర్యము తెచ్చికొని తన స్థితి గతులు వివరించి ఎటులైనను కృతార్థుని జేయవలయునని సోమయాజిని దీనముగా వేడికొనెను. సోమ యాజి క్రిందబెట్టి మీదబెట్టి చిట్టచివరకు వరదక్షిణ క్రింద

మూడువేల రూపాయలును, 'లాంఛనముల' క్రింద రెండు వేల రూపాయలును, మొత్తము అయిదువేల రూపాయలు మొత్తముగా నిచ్చునట్లును, అందు రెండువేల రూపాయలు మునుముందుగా నిచ్చునట్లును కోరెను. చంద్రమౌళి విధిలేక అంగీకరించి, సంబంధము నిశ్చయ పరచుకొని వెడలి పోయెను. ఈ విషయము శ్రీధరశాస్త్రికి తెలియదు.

౧౨

చంద్రమౌళిశర్మ పర్లాకిమిడిలో ఉపాధ్యాయుడుగా నుండెను. వేతనము మాసమునకు నూట పదిరూపాయలు. అతనికి పూర్వులు సంపాదించిన ఆస్తి మూడెకరముల భూమియు ప్రాత పెంకుటిల్లును గలవు. ఆవేతనముతోను ఆభూములమీద వచ్చు స్వల్పాదాయముతోను ఎట్లో సంసారము జరుపుకొనుచు కుమారి కళ్యాణమునకు రెండు వేల రూపాయలు కూడబెట్టెను. ఇక నైదువేలైనను లేనిది వరుని ఘనతకు తగినట్లు వివాహము చేయుటకు వీలులేదు.

అప్పుడతడిట్లు తలపోసెను: "నేటి జీవితములో ధనము ప్రధానమైపోయినది. ఈ విలాసలాలసతకు అంత మెచటనో, దీని పరిణామ మేమగునో దురూహము. ఆధునికజీవితసరణిని జూడ 'అల్లాఉద్దీన్ - అద్భుతదీపము' అను కథలోని

సంఘటనములు స్ఫురణకు వచ్చుచున్నవి. అయద్భుత దీపపు రాక్షసుడు ఈసంఘమును విలాసరంగమున నుంచి పోయి నట్లున్నది. ఆతిక్కరక్కసుడు దాని నెప్పుడో మాయము చేయు నని ఈ సంఘ మూహించుటలేదు గదా !"

ఏది యెట్లయినను చంద్రమౌళి ఆధనము సంపాదించి తీరవలయును. ఆతనికి మార్గమేమియు గోచరింపలేదు. విచారించి విచారించి చివర కతడు భూమిని గృహమును విక్రయింప నిశ్చయించుకొనెను. అమ్మబోయిన నడవి కొనబోయిన కొరవి అను సామెత అతనియెడ సార్థకమైనది. సామాన్యముగా పదివేలరూపాయలు విలువగల ఆస్తి! అత డేమి చేయగలడు! గత్యంతరము లేక తన సర్వస్వమైన భూమిని గృహమును 'అలువు సులువులకు' విక్రయించెను. అందువలన నతనికి ఆరువేల రూపాయలు లభించినవి. మొత్తము ఎనిమిదివేలరూపాయలతో నతడు వివాహసంభారములు సమకూర్ప నారంభించెను.

## ౧౩

వివాహమండపము దీపమాలాపరిశోభితము. బహుధనవ్యయముతో బహుశోభగా నలంకృతమైనది. చిత్రవిచిత్రపతాకలు పవనాందోళితములై అందర నాహ్వానించుచుండెను. రమ్యములైన పటములు, పెద్దపెద్ద దర్ప

ణములు, రంగురంగు కాగితముల పూలదండలు మొదలగు నవి శోభలు వెలార్చుచుండెను. మనోహర వేషభూషలతో బాలబాలికలు తరుణీ తరుణులు వృద్ధులు నలుదెసల దిరుగు చుండిరి. కొందరు పనిపాటులందు నిమగ్నులై యుండిరి. కొందరు దీర్ఘాలోచనాన్వితులై యుండిరి. కొందరు కథలు చెప్పుకొనుచు పరిహాసము లాడుకొనుచు పెద్దపెట్టున నవ్వు చుండిరి.

రామశాస్త్రి గృహమునుండి బయలుదేరి బావమరిది కడకు బోయి కమలను వెంటదీసికొని చంద్రమౌళి యింటికి వచ్చెను.

రామశాస్త్రి పెడగాకుర్చీలో గూర్చుండి అన్య మన స్కుడై వివాహమండపమును అచటి బంధు సమూహమును జూచుచుండెను. అప్రయత్నముగా నతడు జేబు తడవు కొనెను. అందు జానకి యిచ్చిన జాబితా కాగితము కనబడి నది. బయటికి దీసిచూడగా నందు కొన్ని పండ్లపేర్లు వ్రాసి యున్నవి. ఆకస్మికముగా విపత్తు తటస్థించినపు డెట్టి ఆర్తి కలు గునో ఆ కాగితము చూచినంతనే రామశాస్త్రి కట్టి వ్యథ కలిగెను. పండ్లు అనిన నవమాలికకు చాల ప్రీతి. ఆమె గతిం చిన దినము జ్ఞాపక ముంచుకొని ప్రతిసంవత్సర మా తిథి నాడు జానకి ఆపండ్లు తెప్పించి బ్రాహ్మణులకు కన్యలకు నొసగుచు మనశ్శాంతి నొందుచుండెను.

రామశాస్త్రికి కనుల నీరుఁగ్రమ్మెను. అతని కోటు లోపలి జేబులో నోట్లును నవమాలిక కేశగుచ్ఛమును గల సంచియున్నది. అతడు దానిని హృదయమునకు హత్తుకొనెను. అప్పుడతనికి కుమారి చరితము లోని ఏ ఘట్టము స్మృతికి వచ్చెనో!

పెండ్లికొడుకు వచ్చినాడు. వివాహమండపము బంధుమిత్ర సంభాషణములతో ప్రతిధ్వనించుచున్నది. లగ్నము సమీపించుచుండెను. వరుని మిత్రులు కొందరు తాము తెచ్చిన బహుమానము లర్పింప వేగిరపడుచుండిరి. యువకవులు తమ ఆశీర్వాదపద్యములు చదువుటకై కుతూహలపడుచుండిరి.

వివాహక్రియాకలాప మారంభమైనది. సువాసినులు దీపముల పళ్ళెరములతో పరివేష్టించియుండ పెండ్లికొమార్తెను గంపలో గూర్చుండబెట్టి మంగళవాద్యములతో గొనివచ్చి తెరచాటుగా వరుని యెదుట గూర్చుండబెట్టిరి. ఇంతలో నేదియో కలవరము బయలుదేరెను. ఒకడు గబగబ వచ్చి, "శ్రీధరశాస్త్రీ! లేచిరమ్ము. వివాహము జరుగుటకు వీలులేదు" అనెను. శాస్త్రి చటుకున లేచి నిలుచుండెను. అది చూచి కన్యాబంధువులలోని యువకు డొకడు గబుక్కున వచ్చి అతని చేతులు గట్టిగా పట్టుకొనెను. వరుడు చేతులు వదిలించుకొనుటకై మిక్కిలి ప్రయత్నించెను. యువకుడు బలిష్ఠుడగుటచే నతని కది సాధ్యము కాలేదు.

యువకుడు : (మందహాసముతో) ఛీ, ఛీ ! ఏమి పని, తమ్ముడా ! నీవు మిగుల అరసికునివలె నున్నావు ! వివాహము పూర్తి కాకుండ నెచటికి బోయెదవు ?

వరుడు : (విరక్తితో) వదులుడు ! ఏమి జరిగినదో చూచి వచ్చెదను.

యువకుడు : అది ఏమైనను కానిమ్ము. నీవు పెండ్లి పీటమీదినుండి లేచిపోవుట ఉచితము కాదు !

ఇంతలో వరపక్షమువారిద్దరచటికి వచ్చిరి. ఏమి జరిగినదో ఏమో ఎవ్వరికిని ఏమియు తెలియలేదు. కాని అందరు ఉద్విగ్నభావముతో చిందరవందరగా తిరుగ నారంభించిరి.

చంద్రమౌళి లోపలినుండి వివాహ మండపము వైపు వచ్చుచుండెను. అతనిని జూచి రామశాస్త్రి ఎదురు పోయి, "ఏమి జరిగినది, చంద్రమౌళి ?" అని యడిగెను. చంద్రమౌళి అతనిని లోనికి దీసికొనిపోయి, "అన్నయ్యా, మహా విపత్తు సంభవించినది ! వివాహము జరుగునట్లు లేదు. ఏమి చేయుదును" అని కంట నీరు పెట్టుకొనెను.

రామ : ఏమి జరిగినదో స్పష్టముగా జెప్పుము.

చంద్ర : మూడువేల రూపాయలు కట్నము క్రిందను రెండువేల రూపాయలు లాంఛనముల క్రిందను ఇచ్చునట్లు ఒప్పందము జరిగినది. లాంఛనముల పైకము ముందుగా

నిచ్చితిని. కళ్యాణ సమయమున నీయవచ్చును గదా అని మూడు వేలు పెట్టెలోనుండి తీసి ఇంతకు ముందే డ్రాయరులో పెట్టితిని. అవి యిపుడు కనిపించ లేదు.

రామ : (చకితుడై) అయ్యో, ఎంత ప్రమాదము ! చక్కగా వెదకి చూచితివా ?

చంద్ర : ఒక్కసారి కాదు, పదిపర్యాయములు ఎంతో జాగ్రత్తగా వెదకితిని. (హతాశుడై నేలమీద కూలబడి) ఏమి చేయుదును, అన్నయ్యా ! ఇల్లు వాకిలి భూములు తెగ నమ్మి ఎనిమిది వేలు సంగ్రహించితిని. అవి చాలక విరా మరదలు మెడలోని నగలు తాకట్టు పెట్టి మరి వేయి రూపాయలు సేకరించితిని. కట్టకడకు నాగతి యిట్లైనది !

రామ : మరల నొక్కసారి వెదకుదము రమ్ము !

చంద్ర : ఎచట వెదకుదుము ? వెదకుటలో నేమాత్రము లోపము చేయలేదు. పరమేశ్వరా ! సర్వస్వము పోయిన తరువాత గూడ నా కిట్టి అపఖ్యాతి కలిగించితివా !

రామశాస్త్రి చంద్రమౌళిని గదిలోనికి దీసికొని పోయి మరల డ్రాయరులో వెదకి చూచెను. డ్రాయరు స్థితి చూచి నంతనే అన్వేషణము వ్యర్థ మని తోచినది. అయినను డ్రాయరు లోపలనే గాక అతడు దాని చుట్టు ప్రక్కల గూడ పరిశీలించెను.

చంద్రమౌళి భార్య భవాని సంభ్రమముతో వచ్చి తలుపుచెంత నిలుచుండెను. ఆమె యిదివరకెప్పుడును రామశాస్త్రి యెదుటికి వచ్చినది కాదు. ఉదారస్వభావుడనియు సజ్జనుడనియు నామె కాయనయెడ మొదటి నుండియు భక్తి శ్రద్ధలు గలవు. ఆయనకు సంభవించిన ఆపదను గురించి యామె భర్తవలన వినియుండెను. అందుచే నాయన యెదుటికి వచ్చుటకు మరింత సంకోచించుచుండెను కాని యిపుడీ విపరీత సంఘటనమువలన రాక తప్పినది కాదు.

చంద్రమౌళి ఉన్మత్తునివలె కుర్చీలో కూలబడెను. అతని దృష్టిలో శూన్యత ఉదయించినది. ఏమి జరుగుచున్నదో అతనికిపుడు తెలియుటలేదు. మనస్సు సంచలించి స్థానభ్రష్టమైనది. అతడు దీర్ఘ నిశ్వాసము విడిచి మూర్ఛపోయి కుర్చీలోనుండి తపక్కున క్రిందపడెను. అది చూచి భవాని 'అయ్యో' అని యేడ్చెను. రామశాస్త్రి చంద్రమౌళిని లేవనెత్తి ప్రక్కనున్న మంచముమీద పరుండబెట్టి, "అమ్మాయీ! నీవు పోయి జలము గొని రమ్మ" అని భవానితో ననెను. భవాని పోయి జలము తెచ్చెను. రామశాస్త్రి జలమందికొని చంద్రమౌళి మొగముపై చల్ల నారంభించెను. కొంత సేపటికి చంద్రమౌళికి తెలివివచ్చెను. తరువాత నతడు మెల్లగా లేచి కూర్చుండెను.

అపుడు రామశాస్త్రి యిట్లనెను: "తమ్ముడా! నీవు కొంచెము విశ్రాంతి నొందుము. నే నీలోపల వరునితండ్రి యొద్దకు బోయి జరిగిన దంతయు చెప్పివచ్చెదను."

చంద్రమౌళి కాతరస్వరముతో, "పోవలదు, అన్నయ్యా! నే నొకసారి వెళ్ళి జరిగిన వాస్తవము చెప్పి 'మిథ్యావాది, ద్రోహి' అను బిరుదులు పొందివచ్చితిని. అన్నయ్యా! ఈ యవమానము — ఈ వ్యథ నేనిక భరింప లేను. సర్వస్వము విక్రయించి ఆ ధనము సంగ్రహించితిని. ఇక మిగిలిన దేదియు లేదు విక్రయించుటకు. ఇక ఉపాయ మేమున్నది!" అని విలపించెను.

చంద్రమౌళి నిశ్శబ్దముగా శూన్యదృష్టితో జూడ సాగెను. అతని నేత్రములం దేదియో వికృతజ్యోతి గోచరింప దొడగెను. ఆ గదిలో నా ముగ్గురు తప్ప ఇంకెవరును లేరు. అందరును బయటి గందరగోళములో వ్యాపృతులై యుండిరి. రామశాస్త్రి ఏమి ఆలోచించుకొనెనో ఏమో హస్తములు వక్షమునం దుంచికొని పైకి చూచెను. తరువాత నతడు భవానివంక చూచెను. ఆమె ఇంచుక దూరములో నిలు చుండి కంపించుచుండెను. రామశాస్త్రి హృదయము కరుణా పూర్ణమయ్యెను. లోపలి జేబులోని సంచి చేతులకు తాకు చుండుటచే నతనికి నవమాలిక స్మృతికి వచ్చెను.

తరువాత రామశాస్త్రి భవానివంక జూచి, "అమ్మాయీ! తలుపు గడియవేసి రమ్మ" అనెను. భవాని తలుపు బిగించి వచ్చెను. రామశాస్త్రి సంచి బయటికి దీసి మెల్లగా విప్పుచు నిట్లనెను: "తమ్ముడా! నా జీవిత చరిత్ర మంతయు నీ వెరుగుదువు. ఇంతకు ముందు అచట గూర్చుండి

వివాహ మండపమువంక జూచుచుండగా నా ముద్దు బిడ్డ నవమాలిక జ్ఞప్తికి వచ్చినది. ఉన్మత్తునివలె నేటి వరకును ఆమె కళ్యాణము నిమిత్తము పైకము కూడ బెట్టుచునే యుంటిని. నేటినుండి నీ కుమారి సుశీల నా కుమారి నవమాలికగా నెంచుకొందును!" అని పలికెను.

రామశాస్త్రి ఇక మాటాడ లేక పోయెను. బాష్ప వికలమై యతని కంఠస్వరము రుద్ధ మయ్యెను. చంద్రమౌళి అమాంతము రామశాస్త్రిని కౌగలించుకొని గద్గదికతో, "అన్నయ్యా! ఈ నీ ఋణము నా జీవితకాలములో నెట్లో తీర్చికొందును!" అనెను.

అపుడు భవాని, "అట్లనకుడు! ఈ ఋణము మనము తీర్చుకొనలేము. ధనమునకు తిరిగి ధన మిచ్చినంత మాత్రమున ఇట్టి ఋణము తీరగలదా!" అని కృతజ్ఞత వెల్లడించెను.

రామశాస్త్రి ఉద్వేగము నిగ్రహించుకొని యిట్లు పలికెను: "తమ్ముడా! ఇది ఋణము కాదు. ఇది కేవలము మిత్రధర్మము! ఈ విషయ మింకెవ్వరికిని తెలియ గూడదు సుమా! గట్టిగా జ్ఞాపక ముంచుకొనుము."

ఆసమయమున చంద్రమౌళి తమ్ముడు బయటినుండి, 'అన్నయ్యా!' అని పిలుచుచు తలుపు తట్టెను. భవాని కృతజ్ఞతాశ్రువులతో రామశాస్త్రి వంక జూచుచుండెను. రామశాస్త్రి, "అమ్మాయీ! తలుపుతీయుము" అనెను.

చంద్రమౌళి తమ్ముడు తొట్రుపాటుతో లోనికి వచ్చి, "అన్నయ్యా! నీవిచట ఏమి ఆలోచించుచున్నావో! అచట పెద్దగోల జరుగుచున్నది!" అని పలికెను.

రామశాస్త్రి కంపితకరములతో సంచినుండి నోట్లు బయటికి దీసి, తమ్ముడా! వీనిలో మూడువేలు తీసికొని పోయి వర దక్షిణ యిచ్చి రమ్మ అనెను. చంద్రమౌళి సంతోషాశ్చర్యములతో మూడు వందల పది రూపాయల నోట్లు లెక్కపెట్టి తీసికొని బయటికి వెళ్లెను.

రామశాస్త్రి మిగిలిన నోట్లు తీసికొని, "అమ్మాయీ, భవానీ! ఈ పైకము నేను స్వవిషయములకు వినియోగింప దలచలేదు: దీనితో నీవును నా నవమాలికయు నగలు చేయించుకొనుడు!" అనుచు నామె హస్తములం దుంచెను.

భవాని కృతజ్ఞతాశ్చర్యములు తొట్రుపడ రుద్ధకంఠముతో కంపితస్వరముతో, "మీరు మానవులా, దేవతలా!" అని పలుకుచు అప్రయత్నముగా మోకరించి అతని పాదము లంటి నమస్కరించెను. ఇంతలో చంద్రమౌళి తిరిగి వచ్చి 'అన్నయ్యా!' అని కేకపెట్టి రామశాస్త్రి సమాంతము కాగలించుకొనెను.

## ౧౪

మంగళ తూర్యములు మ్రోగుచుండెను. వివాహ మండపమున కొక పార్శ్వమున గూర్చుండి రామశాస్త్రి

మహోత్సవము తిలకించుచుండెను. కాని అతని మనస్సు మాత్ర మచట లేదు. అది దురూహ్యమైన లోకములో, దుష్ప్రాపమైన ప్రదేశములో, నిరాలంబమైన ఆలోచనా పరంపరలో సంచరించుచుండెను. అతని హస్తములు మాత్ర మప్రయత్నముగా నోట్లసంచి బయటికి దీసి అందు నవమాలిక కేశగుచ్ఛము భద్రపరచి మరల జేబులో నుంచి హృదయమునకు హత్తుకొనుచుండెను.

ఉన్నట్లుండి అతని కనుల యెదుట చిమ్మచీకటులు చెలరేగెను. వాని నడుమ బహు దూరమున మినుకు మినుకు మను నక్షత్రము. అది మహావేగముతో నతని వైపు వచ్చుచుండెను. ఆ నక్షత్రము సమీపించిన కొలది జ్యోతిర్మయూఖములు మిరుమిట్లు గొల్పుచుండెను. ఆజ్యోతిస్సు అంతలో మహామార్తాండ మండలాకారము ధరించెను. దాని నడుమ నృసింహస్వామి. ఆ స్వామి యుత్సంగములో నవమాలిక. ఆమె దివ్య తేజస్సుతో కిలకిల నవ్వుచుండెను. రామశాస్త్రి మహానందముతో చేతులు చాచెను.

అదే సమయమున పురోహితుడు ప్రవర చెప్పుటకు కన్యానామ మడిగెను. తోడనే చంద్రమౌళి ఎఱ్ఱవారిన మొగముతో, అశ్రుపూర్ణ నేత్రములతో, కంపితకంఠముతో, "నవమాలిక, నవమాలిక !" అని బిగ్గరగా పలికెను. బాష్పవారి దుర్వారమై బహిర్గత మగుచుండ భవాని కృతజ్ఞతా దృష్టితో రామశాస్త్రి వంక చూచుచు గద్గదికస్వరముతో "నవమాలిక, నవమాలిక !" అని నుడివెను.

ఆ మాట చెవిన బడినంతనే రామశాస్త్రి యులికి పడెను. జ్యోతిర్మండలము తిరోహిత మయ్యెను. నృసింహ స్వామి అంతర్ధానము నొందెను. నవమాలిక అదృశ్య మయ్యెను. అపుడు రామశాస్త్రి హృదయమును భేదించుకొని అవారితావేగ కంపములతో దీర్ఘనిశ్వాసము బహిర్గత మయ్యెను.

వైవాహిక సభవారి దృష్టు లన్నియు ఒక్కసారిగా రామశాస్త్రి మీద వ్రాలినవి. ఆ దృష్టులలో సంతోషాశ్చర్య కృతజ్ఞతలు ముప్పిరిగొనుచుండెను. వరుడు లజ్జాశ్చర్య బహుమానములతో అపాంగాలోకనములతో నవలోకించుచుండెను. వరజనకుడు లజ్జాభిమానములతో నధోవదనుడయ్యెను. ఒక్క నిమేషకాల మెవరి నేత్రములందును నిమేషములు లేవు. సభ యంతయు నిస్తబ్ధము.

అపు డా నిస్తబ్ధతను భేదించుకొనుచు, "నాయనగారు, నాయనగారు!" అను నార్తస్వరము వినబడెను. అందరి దృష్టు లటువైపు తిరిగినవి. వివాహవేదికకు చాల దూరమున బాలిక యొకతె రామశాస్త్రిపై దృష్టి నిగిడ్చి ఆయన కడకు పోవుటకై పెనగులాడుచుండెను. పేద బ్రాహ్మణు డొకడు ఆమెను వెనుకకు లాగుచుండెను. రామశాస్త్రి ఆబిడ్డను చూచెను. కనులు తుడిచికొని తేరిపార చూచెను. వెంటనే యాతడు చంగున బోయి, "తల్లీ, నవమాలికా!" అని కేకపెట్టి ఆబిడ్డ నమాంతము ఎత్తుకొని

హృదయమునకు హత్తుకొనెను. కన్యాదానకలాపము వదలి చంద్రమౌళియు భవానియు కమలయు "నవమాలికా, నవ మాలికా!" అని కేకలిడుచు ఒక్కపరుగున బోయి ఆబిడ్డను చుట్టవేసిరి. ఎవరి నోటను మాటలు లేవు. అందరి నేత్రముల నుండి ఆనందాశ్రువు లనవరతముగా ప్రవహించుచుండెను. బ్రాహ్మణుడు నిశ్చేష్టుడై నిర్నిమేషనయనములతో జూచుచు నిలువబడి పోయెను.

కొంత సేపటికి చంద్రమౌళి తెప్పరిల్లి బ్రాహ్మణునితో నిట్లనెను: "మహానుభావా! మీరు మానవులో, మానవ రూపము ధరించి వచ్చిన మాపాలిటి దేవతలో తెలియుట లేదు. ఈ బిడ్డ — మా నవమాలిక మీ కెట్లు లభించినది?"

బ్రాహ్మణుడు కంపితస్వరముతో నిట్లు చెప్పెను: "అయ్యా! నేను వేదాధ్యయనము చేసిన పేదబ్రాహ్మణుడను. యాయవరము చేత జీవయాత్ర చేయుచున్నాను. మీవంటి శ్రీమంతుల గృహములలో వివాహాది శుభకార్యముల కరిగి సన్మానము నొంది వచ్చుచుందును. ఒకనాడు విజయనగరమునకు పయనమై పోవుచుండగా త్రోవలో నొక చోట మూలుగు వినిపించినది. పరికించి చూడగా నించుక దూరమున ఆకులకుప్పలో నేదియో కదలుచున్నట్లు కనబడినది. అచటికి బోయి ఆకులు తొలగించి చూడగా నీ బిడ్డ స్మృతి లేకుండ పడియుండి మూలుగుచున్నది. ముఖమును శిరోజములును నెత్తుట దోగియున్నవి. చూడగా నెవ్వడో

దురాత్ముడు గొంతు నులిమి పారవేసి పోయిన ట్లగపడినది. నాకు సంతానము లేదు. అప్పల నృసింహస్వామి నాకీ సిసువు నను గ్రహించినా డనుకొని గృహమునకు గొనిపోయి చికిత్స చేయించితిని. నా భార్యయు నేనును ఆరు నెలలు శ్రమపడగా నీ బిడ్డ మరల యథారీతి నొందినది. తరువాత నీమె యూరుపేరులు తల్లిదండ్రులు మొదలగు విషయములు తెలిసికొన ప్రయత్నించితిమి. అది యేమి కారణమో, ప్రశ్నించినప్పు డెల్ల చెప్పలే నన్నట్లు ఈమె కన్ను లప్పగించి వెఱ్ఱి చూపులు చూచినది. ఈ బాలికను గురించి ఇంతవరకు మమ్మడిగిన వారు లేరు. నాటినుండి మే మీమె కూనను నృసింహ వర ప్రసాదినిగా పెంచుకొను చున్నాము !"

వైవాహిక సభవారు విస్మయ విస్ఫారిత నేత్రులై నిశ్శబ్దముగా వినుచుండిరి. రామశాస్త్రి నేత్రములలో ఆనందాశ్చర్య కృతజ్ఞతలు ముప్పిరిగొని వెల్లివిరియు చుండెను. అపుడు చంద్రమౌళి యిట్లనెను : "మహాత్మా ! బీటలువారిన మా జీవితాలవాలములకు మరల నానంద రసము వర్షించినారు. మీరే మాకు ప్రత్యక్ష నృసింహ స్వాములు ! ఇవే మా. పరశతానేక నమస్కారములు ! దయచేయుడు. అనుగ్రహించి మా సత్కారముల నంది మమ్ము ధన్యుల జేయుడు !"

చంద్రమౌళి బ్రాహ్మణోత్తముని కరములు పట్టుకొని వివాహ మండపము కడకు తీసికొని వచ్చుచుండెను.

ఆ సమయమున ద్వారము వైపునుండి, "చంద్రమౌళిశర్మగా రెవరు ?" అను కేక వినబడెను. చకితులై అందరు నటు వైపు చూచిరి. నలుగురు కానిస్టేబులతో హెడ్ కానిస్టేబులు అచట నిలుచుండి మరల, "ఇచట చంద్రమౌళిశర్మగారు ఎవరు?" అని బిగ్గరగా ప్రశ్నించెను.

చంద్రమౌళి సంభ్రమాశ్చర్యములతో నెదురేగి, "నేనే, బాబూ! ఏమి విశేషము?" అనెను.

హెడ్ : మీ యింటిలో చౌర్యము జరిగినదా ?

చంద్ర : జరిగినది. మూడు వేల రూపాయలు పోయినవి.

హెడ్ : ఎవరు తీసినారని మీ అభిప్రాయము ?

చంద్ర : ఎవరని చెప్పుదును, బాబూ! ఆ యీశ్వరునకే తెలియవలయును!

అపుడు హెడ్ కానిస్టేబులు కానిస్టేబుల మరుగున నక్కియున్న మునిముచ్చును బెత్తముతో రెండు చరచి, "వీని నెరుగుదురా?" అని ప్రశ్నించెను.

చంద్రమౌళి ఆశ్చర్యముతో వానివంక తేరిపార జూచి, "వీడా, వీడా! ఓరీ నాగన్నా! నీవా? నీవే దొంగతనము చేసినది? ఎంత విశ్వాస ఘాతుకుడవురా! తిండి లేక గుడ్డ లేక వీధిలో మలమల మాడుచు చావ సిద్ధముగా నున్నవానిని జాలి కలిగి కొనివచ్చి నాలుగు సంవత్సరములనుండి బిడ్డవలె పోషించుచున్నందులకు నాకు

చేసిన ప్రత్యుపకారమా ఇది ! నీ మూలమున నా కుమారి కళ్యాణ మాగి పోయెడిదే — ఇదిగో ఈ మహానీయుడు నా పాలిటి దైవమువలె నా యాపద కడ్డుపడకుండిన !" అని కళ్ళు పడెను.

హెడ్ కానిస్టేబులు బెత్తముతో కోపము కొలది నాగన్నకు మరి నాలు గంటించి, "చంద్రమౌళి శర్మగారూ! మీ యుపకారమున కీ పరమ కిరాతుడు చక్కని ప్రత్యుపకారము చేసినాడు ! పా మని తెలియక పాలుపోసి పెంచినారు. ఈ పాపిని ! సరే ! మీ మూడు వేల రూపాయలు దొరకినవి. న్యాయార్జితమున కెన్నడును నష్టము కలుగదు లెండు ! భగవంతుడు సర్వదా ధర్మాధర్మములు ఒక కంట కనిపెట్టుచునే యుండును ! సాయంకాలము మీ రొకసారి ఠాణాకు దయచేయుడు" అని చెప్పి కానిస్టేబుల తోడను దొంగ తోడను వెడలి పోయెను.

సభాస్తారు లాశ్చర్యాపహృత చేష్టులై చిత్రిత ప్రతిమ లై పోయిరి. వారి కది యంతయు నొకానొక యపూర్వ కథా ప్రదర్శనమందలి యద్భుత సన్నివేశము నుపలక్షించు చున్నట్లుండెను.

మహోల్లాసముతో మరలకళ్యాణక్రియాకలాపమారంభ మయ్యెను. చంద్రమౌళి సుశీలను నవమాలిక అను నామము తోనే దానము చేసెను. వధూవరులు మహోత్సాహముతో నొండొరుల శిరములపై తలబ్రాలు పోసికొనిరి. తరువాత

కట్నము చదివించు సమయము వచ్చిన దని పురోహితుడు హెచ్చరించెను. తోడనే చంద్రమౌళి మూడు వేల పదియూపా యల నోట్లు తాంబూల సహితముగా వెండి తాంబాళమం దుంచి సోమయాజి ముందు పెట్టెను. సోమయాజి నోట్లు లెక్క పెట్టి పళ్లెము పురోహితుని చేతి కందిచ్చెను. పురోహితుడు చదివించుట కుపక్రమించెను. తటాలున శ్రీధరశాస్త్రి పళ్లెము లాగికొని, వలదు, చదివింపవలదు !" అని బిగ్గరగా పలికెను.

సభాసదులు విస్మయోద్దీపిత నేత్రులై శాస్త్రివంక జూడ దొడగిరి. చంద్రమౌళి మొగము వెలవెల బోయెను. భవాని కనీనికలు వెఱ్ఱి చూపులు వెలువరించెను. రామశాస్త్రి తొట్రుపడుచు సమీపించెను. సోమయాజి వదనము క్రోధో ద్దీపిత మయ్యెను.

రామశాస్త్రి వరుని చెంత గూర్చుండి కంపిత స్వర ముతో, "నాయనా, శాస్త్రీ ! మా వల్ల నేమి యపరాధము జరిగినది ?" అని సకరుణముగా నడిగెను. "ఉదారమూర్తులు సచ్చరిత్రులు నగు మీ వలన గాని మా మామగారి వలన గాని అపరాధ మావంతయు లేదు. అపరాధ మంతయు నాదే! నన్ను క్షమింప వేడుచున్నాను."

రామ : నాయనా ! నీ భావము బోధ పడలేదు.

శ్రీధర : నాకు కట్న మక్కరలేదు. నేను స్వీకరింపను.

రామ : కారణ మడుగ వచ్చునా ?

శ్రీధర : నేను ప్రతిజ్ఞా బద్ధుడను. అంతేగాని వేరు కారణము లేదు. నన్ను అన్యథా శంకింప వలదు.

రామ : ప్రతిజ్ఞాబద్ధుడవా ? ఆ ప్రతిజ్ఞ యేమి ?

శ్రీధర : పెద్దలు మీరు అడుగుచున్నారు గనుక వివరముగా చెప్పుచున్నాను. మా కలాశాలలోని బి. ఏ విద్యార్థులము కొందరము సంఘముగా నేర్పడి ప్రస్తుతము మన సంఘమున విచ్చల విడిగా చెలరేగి భీషణ తాండవము సలుపుచున్న కట్నపు పిశాచమును రూపుమాపుటకు కృత నిశ్చయుల మైతిమి. ఈ పిశాచ మావేశించి నంత నే కలవారు లేనివారు అను విభేదము లేకుండ విద్యావంతులు వివేక వంతులు గూడ దీని ప్రభావమునకు లోనగుచున్నారు. దురాశాగ్రస్తులై దురతిశయ విమూఢులై కర్తవ్యభ్రష్టు లగుచున్నారు. ఇందువలన నెన్నో పేదకుటుంబములు పడరాని పాట్లు పడవలసి వచ్చుచున్నవి. ఇంత దనుక వారు అయిదు వేలు వీరు పదివేలు కట్నములు తీసికొని నారట అని పరోక్షముగా వినియుంటిని. నేడు ప్రత్యక్షముగా జూచుచున్నాను– అనుభవించుచున్నాను. ఈ వివాహ ధనము కోసము మామ గారు పడిన యిక్కట్లు కొంతవరకు ఇప్పుడే విన్నాను. చివరకు సాక్షా త్పార్వతీ స్వరూపిణి యగు అత్తగారి మెడలోని నగలు కూడ కుదువ బెట్టినారట ! నాకీ కట్న మెంత మాత్రము వలదు !

సభలో కొందరు, "సెబాసు శ్రీధరశాస్త్రీ, సెబాసు!" అని యుత్సాహముతో కేకలు వేసిరి. "జయ్, శ్రీధరశాస్త్రికి, జయ్ !" అని మరి కొందరు యువకులు కరతాళధ్వనులు చేసిరి. కొందరు ముదుసలులు మొగములు ముడిచికొనిరి. కొందరుకన్యాజనకులు బహుమానదృష్టులు వెలార్చిరి. భవానీ చంద్రమౌళుల నయనములు సంతోషోద్భాసితము లైనవి. సోమయాజి చక్షువులు జపాకుసుమ బాణములు వర్షించినవి. అతని వదనము లజ్జాభిమాన ఘూర్ణితమై క్రోధావమాన సంహతమై మెల్లగా క్రిందికి వంగినది.

రామశాస్త్రి పెండ్లికొడుకు పలుకులకు లోలోన మెచ్చుకొనుచు ప్రకాశముగా నిట్లనెను: "నాయనా! నీ యాదర్శము శ్లాఘ్యమైనది, దేశహితమైనది, సత్సంప్రదాయ సమ్మతమైనది. అయినను సంఘమందొకానొక యాచారము ప్రబలముగా నున్నప్పుడు అది యెట్టిదైనను అను సరణీయమే గదా! ఎవరి కష్ట నిష్ఠురములు వారివి. ఎవరి యదృష్ట మెట్లున్నదో వారి జీవిత మట్లు గడచును. ఈ సమయమున నీ వేయాలోచనము పెట్టుకొనక నీ కోసము నిర్దిష్టమైన ధనము నిరాకరింపక అంగీకరింపుము."

శ్రీధర: మామగారూ! పెద్దల హితము అనుల్లంఘనీయము. అయినను మీరు నన్నిట్లు ఆజ్ఞాపింప వలదు. ఇదే మీ పాదము లంటి ప్రతిజ్ఞ చేయుచున్నాను: నే నీ కట్నము పరిగ్రహింపను.

రామ : (సంతోషాతిశయముతో) నాయనా ! దీర్ఘాయుష్మంతుడవై సమస్త సౌభాగ్యములతో వర్ధిల్లుము ! నీవంటి ఉత్తమాశయుల చేతనే - కార్యదీక్షావరుల చేతనే దేశమునకు కళ్యాణము కలుగవలయును !

వివాహము మహోల్లాసముతో జరిగినది. సంతోషము సర్వతోముఖముగ తాండవించినది. మరి సోమయాజి హృదయమో ? అది దురూహము !

౧౫

వివాహానంతరము రామశాస్త్రి నవమాలికతోడను కమలతోడను బ్రాహ్మణునితోడను స్వగ్రామమునకు బయలుదేరెను. చంద్రమౌళి అతనిని సమీపించి, "అన్నయ్యా ! నీవు చేసిన మహోపకారము జన్మజన్మాంతరములందును మరువరానిది. నీవాత్సల్యమువల్లను నృసింహస్వామి అనుగ్రహమువల్లను ఈ కార్యము గట్టెక్కినది. నీ వొసగిన ధనము స్వీకరించి నన్ను కృతార్థుని జేయవలెను !" అని వేడికొనెను. భవాని తలుపుచెంత నిలుచుండి ఆసక్తితో వినుచుండెను.

అపుడు రామశాస్త్రి యిట్లనెను : "తమ్ముడా ! నీవా విధముగ నాలోచింపవలదు. నాధనము నే నెవరి కొసగితిని ! ఎందుల కొసగితిని ! దయామయు డగు నృసింహస్వామి

నా కిపుడు ఇద్దరు బిడ్డలను ప్రసాదించినాడు! అందులో నొకబిడ్డ కిపుడు వివాహము జరిగినది. దాని కళ్యాణమునకు వినియోగించిన ధనము దానిదే! ఇక మారు మాట ఆడవద్దు!"

చంద్రమౌళియు భవానియు కృతజ్ఞతా పూర్ణ హృదయములతో రామశాస్త్రికి నమస్కరించిరి.

## ౧౬

జానకి వీధివాకిట నిలుచుండి భర్త్రాగమనమునకై నిరీక్షించుచుండెను. ఆ సమయమున కమల పరుగున వచ్చి, "వదినా! నీకు రెండు శుభవార్తలు తెచ్చితిని. చెప్పిన నాకేమిచ్చెదవు?" అని సంతోషముతో ననెను.

జానకి : ముందు చెప్పుము. తరువాత నే మిచ్చెదనో చెప్పెదను.

కమల : సుశీలకు నవమాలిక పేరు పెట్టి పెండ్లి చేసినారు.

జానకి : సంతోషము! రెండవ శుభవార్త యేమి?

కమల : చెప్పుమందువా? చెప్పిన నమ్మెదవా?

జానకి : నమ్మదగిన దైన తప్పక నమ్మెదను.

కమల : మన నవమాలిక దొరకిన దని చెప్పెద నను కొనుము. నమ్ముదువా?

జానకి : (నిట్టూర్చి) ఇంకెక్కడి నవమాలిక, తల్లీ ! ఋణము తీరి అయిదు సంవత్సరములు నిండినవి. బ్రదికి యుండిన పదియేండ్ల బిడ్డ! ఈ పాపాత్మురాలు అంతటి అదృష్టమునకు నోచుకొనలేదు.

కమల : నిజముగా, వదినా ! అన్నయ్య తీసికొని వచ్చుచున్నాడు.

జానకి : నిజముగా !

అంతలో రామశాస్త్రి యామె దృష్టిపథములోనికి వచ్చెను. తల్లిని జూచినంతనే నవమాలిక, "అమ్మా, అమ్మా!" అని కేకలు పెట్టుచు పరుగున వచ్చుచుండెను. బిడ్డ కనిపించినంతనే జానకి విద్యుద్వేగముతో నెదురు పోయి, "నాతల్లీ!" అని నవమాలికను కౌగలించుకొనెను. అప్పు డాజనని పొందిన ఆనందము అనుభవైకవేద్యము.

ఆనందోల్బణ మణగిన తరువాత జరిగిన వృత్తాంతమంతయు వివరించి రామశాస్త్రి యాబ్రాహ్మణోత్తముని జూపి, "ఈ మహాత్ముడే మనకు నవమాలికను ప్రసాదించిన ఆ నృసింహస్వామి !" అనెను. తోడనే జానకి ఆయన చరణములు ఆనందబాష్ప ధారతో నభిషేకించెను.

*

# రాజర్షి

## ౧

మానవు డెన్నటికిని అమరుడు కాజాలడు. జన్మించినవాడు మరణింపక తప్పదు. అందుచేత ప్రతి మానవుడును తన జీవితకాలములో తన కర్తవ్యమును యథాసాధ్యముగా పరిపాలించుట యుక్తము. కాని యీ సంసార సంగ్రామములో ప్రతి పదక్షేపమందును స్వార్థత్యాగముతోను, సత్యనిష్ఠతోను, ధర్మశ్రద్ధతోను, పరోపకార దీక్షతోను ఎందరు అగ్రగాములు కాగలరు? అట్లు అగ్రగామియై ఎవడు సర్వదా కర్తవ్యపరాయణు డగునో అతడే యీ లోకమున అక్షయకీర్తి గణించి అమరత్వము నొందగలడు. అలాగున నమరత్వము నొందిన రాజర్షి రాణా ప్రతాపసింహుడు!

ప్రతాపసింహుడు స్వదేశ సేవాశోభితమగు పవిత్ర చరిత్ర దర్పణమున తన ధర్మ వీర చిత్రమును ప్రతి ఫలింప జేసిన మహాపురుషుడు! అతడు శిశోదీయ వంశ మార్తాండుడు, చితోడు దేశాధిపతి. అతడు నేటి కించుమించు నాలుగు శతాబ్దుల క్రింద ఇహలోకము పరిత్యజించినాడు. కాని నేటికిని అతని నిర్మలయశశ్శరీరము భారత ప్రజల మనోనేత్రముల ముందు దేదీప్యమానముగా వెలుగుచునే యున్నది. అనిత్యమైన జీవితములో స్వీయధర్మమును సక్రమముగ నిర్వర్తించి ఆదేవమాన్యు డెట్టి శాశ్వతకీర్తి నొందెనో దానిని మోహాంధమైన యీ జగత్తు తెలిసియు తెలిసికొనలేదు!

ఆ కాలమున మొగలులు విజృంభించి భారత దేశమున తమ సామ్రాజ్యము విస్తరించుకొని యుండిరి. వారి పేరు చెప్పిన మహిమవ్యాఘ్రము లేక ఘటమున జలము త్రాగుచుండెడివి. వారి ప్రబలప్రతాప మట్లు నిరంకుశముగా ప్రకాశించుచున్నది! అప్పుడు మహామాన్యు డగు అక్బరు సమ్రాట్టుగా నుండెను అతడు మహావీరుడు, న్యాయపరాయణుడు, గుణవంతుల నాదరించుటలో నేర్పరి.

వెనుకటి ముసల్‌మాను ప్రభువులు మతవిశ్వాసము లందును ఆచారవ్యవహారము లందును హిందూ మహమ్మదీయులకు గల వైషమ్యము స్పర్ధ తిరస్కారము శత్రుత్వము మొదలగువానిని తొలగించుటకు మారుగా వృద్ధినొందించు

చుండిరి. అక్బరు చక్రవర్తి అట్టి వానిని దూరీకరించుటయం దగ్రగణ్యుఁ డయ్యెను.

సాధారణముగా ముసల్‌మానుల పరిపాలనకాలములో హిందువులకు రాజాస్థానమున నున్నతపదవులు పొందుట శక్యము కాకుండెడిది. విద్యావిశేషము బుద్ధి కుశలత న్యాయము దక్షత మొదలైనవి విచారింపక వారు జాత్యభిమానమును కులపక్షపాతమును మాత్రము పాటించి తమవారికే రాజకీయోన్నతపదవు లొసగుచుండిరి. అందువలన రాజ కార్యములు సక్రమముగా నెరవేరకపోవుటయే కాక రాజ్యమందు ద్వేషము దౌర్జన్యము అన్యాయము హింస మొదలగునవి పెచ్చుపెరిగి రాజ్య స్థైర్యమునకు భంగము వాటిల్లుచుండెడిది.

న్యాయనిష్ఠాగరిష్ఠుఁ డగు అక్బరుపాదుషా మాత్రమట్లు గాక సింహాసన మధిష్ఠించినది మొదలు జాతిమత భేదము సరకుసేయక స్వకులాభిమానము పాటించక విద్యావంతులు బుద్ధిమంతులు న్యాయనిరతులు సమర్థులు నగు వారికే ఉన్నతపదవు లొసగసాగెను. హిందూముసల్‌మానులకు సమత్వము సమకూర్చి రక్షింప యత్నించెను. ఆ కారణమున నతని రాజ్యము సురక్షితమై పాదుకొన్నది. దౌర్జన్యము నశించి న్యాయము వర్ధిల్లినది. ఉభయ జాతులలోని సామాన్యులందు గూడ పాలకులు పాలితులు అను భేదభావము సన్నగిల్లి దేశ మంతటను సుఖశాంతులు నెలకొన్నవి.

కుశాగ్రబుద్ధి యగు అక్బరు పాదుషా రాజ్యమునకు వచ్చిన కొలది కాలముననే భరత ఖండమందలి నానా రాష్ట్ర వాసులలోని కెల్ల రాజపుత్రులే అగ్రగణ్యులని గ్రహించెను. "సాహసములోను శౌర్యములోను ఔదార్యములోను సరల భావములోను న్యాయ నిష్ఠలోను రాజపుత్రులతో సమాను లాకాలమున భారత భూమియందే కాక భూమండలమున గూడ నుండి యుండరు. అందుచేత భారత దేశమున మొగ లుల శక్తి చిరస్థాయిగా నుండవలయు నన్న మున్ముందు రాజపుత్రులు స్వాధీనులు కావలయు" నని దూరదర్శి యగు అక్బరు తెలిసికొనెను. రాజ పుత్రుల బాహుబలము సింహా సన రక్షణార్థము వినియోగించు కొన్నచో తన్ను ఎదురించ గల వార లెవ్వరు నుండ రని తలపోసెను. అందుకోసము నిర్భయులును వీరులును విశ్వాస్యులును నగు రాజ పుత్రులను స్వాధీన పరచుకొన నిశ్చయించెను.

ఆ కాలమున రాజపుత్ర స్థానములో చిన్నవియు పెద్దవియు రాజపుత్ర రాజ్యములు చాల గలవు. అవి వేని కవి స్వతంత్రములై సమృద్ధములుగా నుండెను. వాని నొక్క టొక్కటిగా అక్బరు హస్తగతము చేసికొన నారంభించెను. మొట్టమొదట గొప్ప ధనమును గొప్ప రాజ కీయపదవులను నొసగెద నని యతడు రాజపుత్రులను ప్రలోభ పెట్టెను. ఆ వ్యామోహముతో నతడనేక రాజ పుత్రుల యొక్కయు వారి సామంతుల యొక్కయు రాజ్యము లను స్వాతంత్ర్యములను విక్రయించుకొనెను. ఆ ప్రలోభ

మునకు లోబడని ప్రదేశములందు అసంఖ్యాకు లగు మొగలు సైనికులు చెప్పరాని దుష్కార్యము లొనర్చిరి. పెట్టరాని హింసలు పెట్టిరి. నరరక్తముతో నదులు ప్రవహింప జేసిరి. గ్రామములను నగరములను నాశము గావించిరి. వీరులైన రాజపుత్రులు యుద్ధములో ప్రాణములు కోలు పోయిరి. సతీత్వ సంరక్షణార్థము వీరపత్నులు 'జహార్ వ్రతము' (అగ్ని కుండ ప్రవేశము) గావించిరి. రాజపుత్ర స్థానము శ్మశాన వాటిక యయ్యెను. ఆ ప్రలోభమునకు లోబడని వారును యుద్ధములందు పరాభూతులు కాని వారును ఒక్కరు గూడ లేరని చెప్పవచ్చును. ఖడ్గము ధరించి యెదుర్కొన్నవాడు నిహతు డయ్యెను. శరణన్నవాడు పదవీ లాభ మొంది మొగలు మార్గానువర్తి కావలసి వచ్చెను.

ఇట్టి సందర్భములో సమ్రాట్టుకు విరుద్ధముగా కత్తి గట్టి నిలిచిన దొక్క చిత్తోడు మాత్రమే! చిత్తోడు మేవాడు రాజ్యమునకు రాజధాని. రాజపుత్రస్థానములో మేవాడు రాజ్యమే సర్వశ్రేష్ఠమైనది. ఉదయసింహుడు చిత్తోడు సింహాసన మధిష్ఠించియుండెను. చాలమంది సర్దారులును సామంతులును ఆతని యధీనములో నుండిరి. వారందరును గలిసి రాజ్యహితమునకై అహోరాత్రములు పాటుపడు చుండిరి. వారి మనస్సులలో హింసాద్వేషము లేమాత్రము లేవు. న్యాయపరిపాలనమును దేశహితమును మాత్రమే వారి లక్ష్యములు. అట్టి సర్దారులవలె నిర్భీకులు, యోధులు,

తీక్ష్ణబుద్ధులు, మంత్రిసత్తములు, వినయ విశిష్టులు నగు పురుషపుంగవు లే దేశమున పాలకులుగా నుందురో ఆ దేశము సకలసౌభాగ్యములతో తులదూగకుండునా !

మేవాడదేశ మీ విధముగా సుఖశాంతులతో తేలి యాడుచుండ మొగలులు మిడుతలదండులవలె గుంపులు గుంపులుగా వచ్చి పడి చిత్తోడును వశపరచుకొన యత్నించు చుండిరి. మొగలు సైన్యము చిత్తోడును పరివేష్టింప నారంభించెను. అక్బరు స్వయముగా చిత్తోడు నాక్రమించెను. అట్టి విపత్సమయమున రాణా ఉదయసింహుడు క్షత్రియోచితసాహసముతో ప్రజాబృందమును ప్రోత్సహించి సైనికులను సమకూర్చుకొని శత్రునాశమునకై అగ్రేసరు డగుటకు మారు ప్రాణభీతిచే పార్శ్వచరులతోడను రక్షకసైన్యముతోడను చిత్తోడు పరిత్యజించి పలాయితు డయ్యెను.

౨

ఉదయసింహుడు కాపురుషుడు, మేవాడదేశపు కుసంతానము. కాని మేవాడు వీరప్రసవిని. ఆదేశమాతకు సుపుత్రు లనేకులు కలరు. ఉదయసింహుడు పందయై పారిపోయిన తరువాత పుత్తుడును జయమల్లుడును ప్రధానసేనాధిపత్యము వహించిరి. మేవాడదేశ మంతయు వారి యాజ్ఞ రాజాజ్ఞవలె శిరసావహించి మహోత్సాహముతో పాలింప

సాగిరి. ఈ స్వాతంత్ర్య యుద్ధములో కేవల మొక్క రాజ పుత్ర వీరపురుషులే అగ్రేసరులు కాలేదు. ఒక వైపున సాహిదాను మొదలగు సామంత వీరపురుషు లశ్వారోహులై సైన్యముల నడిపించుచుండ ఇంకొక వైపున కర్మదేవి కర్ణదేవి కమలాదేవి మొదలగు రాజపుత్ర వీరాంగనలు స్త్రీ సైన్యము నాయత్తపరచి శత్రుధ్వంసమునకై బయలు దేరిరి.

కాని విధివిధానము విపరీతముగా పరిణమించినది. శత్రువు లధర్మయుద్ధమునకు పాలుపడుటచే ధర్మయుద్ధ నిరతులగు రాజపుత్రులు వారి ధాకకు నిలువలేక పోయిరి. అందుచేత సేనాపతి యగు పుత్తుడు పరలోకగతు డయ్యెను జయమల్లుడు స్వర్గస్థు డయ్యెను. తక్కిన వీరపుంగవులు కూడ క్రమక్రమముగా నిహతు లైరి. విజయము కలుగు ననుధైర్యము గాని ఆశగాని ఏమాత్రము లేదని తెలిసినంతనే మేవాడులోని రాజపుత్ర వీరాంగనలు ఆత్మసమర్పణ (జహార్‌వ్రత) మున కేర్పడిన అగ్నికుండములు ప్రజ్వలింప జేసిరి. పతివ్రత లగు నా వీరపత్నులు తమ పవిత్ర దేహముల నాచితిజ్వాలలం దాహుతులు చేసికొనిరి. జీవించి యున్న అల్పసంఖ్యాకులు తమ తల్లులు చెల్లెండ్రు కుమారికలు మొదలగు వారు తమ కనుల యెదుట నగ్నిజ్వాలలతో నైక్య మొందుట వీక్షించి క్షణకాలము శోకవిహ్వాలులైరి. ఉత్తరక్షణమున వారందరును కత్తులు దూసి అపారమైన మొగలువాహిని మీదికి లంఘించిరి. ఒక్క ముహూర్త

కాలము స్వదేశమహాప్రాణతను తేజరిల్లజేసి పరమపావిత్ర్యము న రక్తధారాపవిత్రీకృతము లగు తమ ప్రాణముల నా వీరులు మాతృభూమి కర్పించి మాతృఋణము తీర్చి కొనిరి.

చితోడు శత్రుహస్తగతమైన దనిన దుర్వార్త విని నంతనే ఉదయసింహుని హృదయము విదీర్ణ మయ్యెను. ఉదయసింహుడు స్వభావముచేత విలాసప్రియుడు. ఇపుడు భగ్నహృదయు డగుటచేత చిత్తసమాధానము కోసము విశేషముగా విలాసములందు మునిగి కాలము గడపు చుండెను. చితోడు వదలిన తరువాత నతడు ఆరవల్లీపర్వత ములందలి యొకానొక ఉపత్యకజేరి అచటి హ్రదతీరమున తన శిబిరము స్థాపించెను. అతని పేరు ననుసరించి ఆ హ్రద మునకు ఉదయ సాగర మను పేరు వచ్చెను. అతని వెంట వచ్చిన పార్శ్వచరులును రక్షకసైన్యమును అచటనే నిలిచి పోయెను. తరువాత చితోడునుండి పారివచ్చిన వారును యుద్ధానంతరము జీవించియున్న సర్దారులును సామంతులు మొదలగు వారును ఆరవల్లీ పర్వతములకు వచ్చి ఉదయ సింహు నాశ్రయించిరి.

ఈ విధముగా నా ప్రదేశమున ఉదయ నగర మను పేరుతో గొప్ప నగర మొకటి నిర్మితమయ్యెను. ఉదయ సింహు డచట గొప్ప రాజప్రాసాదము కట్టించెను. ఉదయ సాగరమునకు చుట్టును గల పర్వతపంక్తులును సాంద్రారణ్య

ములును ఇప్పుడు మేవాడు రాణాకు రాజ్య మైనవి. చితో
డును దానికి సంబంధించిన రాజ్య భాగములును మొగలుల
అధికారమునకు లోబడి పోవుటచే నూతన మేవాడ రాజ్య
మునకు ఉదయ నగరము రాజధాని యయ్యెను. చితోడు
పడిపోయిన నాలుగు సంవత్సరములకు ఉదయ నగరముననే
ఉదయసింహుడు మరణించెను. అతనికి పెక్కుమంది భార్యలు
కలరు. పుత్రులు గూడ చాలమంది కలరు. వారిలో సర్వ
జ్యేష్ఠు డగు ప్రతాపసింహుడు సింహాసన మధిష్ఠించెను.

## 3

ప్రతాపసింహుడు రాజు అయినాడు. సంతోషమే.
కాని యేమి ప్రయోజనము ? అతని రాజ్యము శత్రుహస్త
గత మైనది. అతని రాజధాని యగు చితోడును శత్రువులు
ధ్వంసము చేసిరి. చితోడు పడిపోయి నంతనే రాజపుత్ర
స్థానములోని రాజు లందరి హృదయములలో విశేషముగా
భయసంచారము కలిగెను. అందుచేత వారిలో నెవ్వరును
మొగలులకు విరుద్ధముగా కత్తిగట్ట సాహసింప లేక పోయిరి.
అట్లు భయపడిన సామాన్య రాజపుత్రుల నందరను ప్రతాప
సింహు డాహ్వానించెను. వారందరును ఆరవల్లి పర్వతములకు
వచ్చి ప్రతాపు నాశ్రయించిరి. ప్రతాపుడు నాయకత్వము
వహించి వారిని వెంట దీసికొని ఆరవల్లి పర్వతములందలి
ప్రతి ప్రదేశమును ప్రతి వనమును తిరిగి చూచెను.

ఆ సమయమున అక్బరు రాజపుత్ర స్థానమును స్వాధీనము చేసికొనుటకై తన ప్రధాన సైన్యమును ఆజ్మీరులో నెలకొల్పెను అది కనిపెట్టి ప్రతాపుడు ఆకస్మికముగా పర్వత పాద భూములకు దిగి మొగలు సైన్యముల నాక్రమించి వారి ఆహారపదార్థములను ధాన్యసంచయములను మందుగుండు సామానులను ఆయుధాదులను అపహరించుచుండెను.

మొగలుల పారతంత్ర్య మంగీకరింపవలసివచ్చునను భయముచేతను వారిసంపర్కమువలన తన వంశము దూషితము కాకుండ రక్షించుకొనుటకును జన్మభూమిని త్యజించి పర్వతముల కరిగి ఉదయసింహుడు తన స్వాతంత్ర్యము కాపాడుకొనెను. మొగలులకు వశవర్తులైన అన్యోన్య రాజులవలె ఉదయసింహుడు గూడ మొగలుల రాజత్వ మంగీకరించి యుండినచో నతని రాజ్యము చెక్కుచెదరక సురక్షిత మయ్యెడిదే. అంతియే కాక అతడు గొప్ప బహుమానము గూడ పొంది యుండెడి వాడే. ఆ విషయము తెలిసియున్నను అత డట్టి ప్రలోభమునకు వశీకృతుడు కాలేదు. అదే విధముగా ప్రతాపుడు గూడ అట్టి యాలోచనము సైతము మనసులోనికి రానీయలేదు. పైపెచ్చు రాజధాని నుద్ధరించు దృఢసంకల్పముతో రాథోడ్ చోందావత్ మొదలగు సర్దారుల వంశములలో మిగిలిన పరివారమును తన సన్నిధికి రప్పించుకొని వారిని తన వారిలో

గలుపుకొనెను. మేవాడరాజ్యమునకు బంధువులుగను స్నేహితులుగను నున్నవారి నందరిని కలుపుకొనుటకై ప్రయత్నింప నారంభించెను.

మేవాడు పరహస్తగతమై యుండ ప్రతాపుడు నిశ్చేష్టుడై యుండగలడా? అత డిట్లు పలుకు చుండెడివాడు: "మేవాడు నా జన్మభూమి. పాలు పోసి పెంచి నన్నింత పెద్దవానిని జేసినది. నేను నా మాతృఋణము లవలేశమైనను తీర్చుకొనుటకై ప్రయత్నింప వలదా? ఇట్టి రాజ వంశమున జన్మించి ప్రాణభయముచే పిరికి వాడ నగుదునా?"

తేజములో ప్రతాపునితో సమానులు లేరు. ఒక్క ముహూర్త కాలమైనను ఆతని హృదయమున దౌర్బల్య మావహింపలేదు. రాజపుత్ర జాతి యందలి వీర తేజస్సుతోను శిశోదీయ కుల మందలి నిరుపమాన తేజస్సు తోను తేజస్వి అయిన ప్రతాపసింహుడు మొగలుల అధికారమునకు శిరము వంచ లేదు.

మన భారత దేశ మనాదినుండియు జ్ఞాన వైరాగ్యములకును ధర్మాచరణమునకును పుట్టినిల్లు. సంసార సుఖములు పరిత్యజించి, అరణ్యములందు నివసించి, కందమూలములు భుజించి, కఠోర తపస్సు లాచరించి మహామహిమాన్వితులైన తాపసవరేణ్యులు మన భారత సంతానమే! గృహస్థులుగా నుండియు రాజభోగములు విసర్జించి, నిగ్రహ మవలంబించి, కఠిన నియమములు పాటించి మహానుభావులైన

రాజర్షిసత్తములు మన భారతప్రభువులే! అట్టి రాజర్షులలో ప్రతాపసింహు డొకడు.

మన బ్రహ్మర్షులకును రాజర్షులకును ప్రధానలక్ష్యము బ్రహ్మజ్ఞానము. స్వదేశోద్ధరణము, స్వాతంత్ర్య స్థాపనము, స్వధర్మరక్షణము – ఇవి మన ప్రతాపసింహుని లక్ష్యములు. వానిని సాధించుటకై యత డసాధారణ నియమముల నవలంబించెను. అతడు సువర్ణ రజత పాత్రలు వదలి పత్రాదులందు భుజించెను. రాజోచితము లగు వేషభూషలను రత్నాలంకారములను విసర్జించెను. వినోదవిహారములను వాని కువయుక్తము లగు విలాసవస్తువులను దూరీకరించెను. పర్యంకములను హంసతూలికాతల్పములను విడచి తృణశయ్యనాశ్రయించెను. దాసదాసీజనసేవలు నిరాకరించెను. చిత్తోడు నుద్ధరించు నంతవరకు, మేవాడులో స్వాతంత్ర్యమును స్థాపించు నంతవరకు, ధర్మప్రభుత్వము నెలకొల్పు నంతవరకు రాజోచితము లగు వస్తువులను వేనిని గూడ ముట్టనని ప్రతిజ్ఞ చేసెను. అప్పటినుండి శోకచిహ్నముగా శిరోజములను గడ్డమును పెంచెను. అత డిట్లు పలుకుచుండు వాడు: "చిత్తోడు నా జనని. నా జనని పరపాశబద్ధయై పడరాని బాధలు పడుచుండ నేను విలాసముగా నుండుట తగునా – రాజభోగము లనుభవించుట ధర్మమా!" అట్టి మనోబలమును ధైర్యసాహసములును లేకుండిన ప్రబలప్రతాపాన్వితు డగు మొగలుచక్రవర్తికి విరుద్ధముగా కత్తిగట్టి అంత్యకాలము

వరకు దుఃఖములను దుర్దశలను అనుభవింపకున్న ప్రతాప సింహుడు స్వదేశమును స్వాతంత్ర్యమును ధర్మప్రభుత్వ మును సురక్షితము చేసియుండగలడా!

౪

రాజపుత్రస్థానములో మేవాడు తరువాత అంబరు (జయపురము) మార్వారు (యోధపురము) అనునవి గొప్ప రాజ్యములు. అక్బరుపాదుషా వానితో సంధి చేసికొన ప్రస్తావించెను. ఆ కాలపు జయపురమహారాజగు విహారీ మల్లుడును, అతని కుమారుడగు భగవాన్‌దాసుడును మున్ముందుగా సంధి కొడంబడి అక్బరుపక్షమాశ్రయించిరి. విహారీమల్లుడు పాదుషావారి అనుగ్రహమును తన్మూలమున ఉన్నతాధికారమును పొందుటయే కాక సమ్రాట్టుతోడి బాంధవ్యము దృఢపరచుకొనుటకై తన ఏకపుత్రికను అక్బరు కిచ్చి వివాహము చేసెను.

ఈ వివాహము సంగీకరించుటలో అక్బరుపాదుషాకు రహస్యోద్దేశము కలదు. రాజపుత్రులను తనవారినిగా జేసికొనవలయునని అతని యభిలాషము. రాజపుత్రులతో మర్యాదగా ప్రవర్తించుట, వారి సుగుణవిశేషముల నాదరించుట, వారి కున్నతపదవు లొసగుట మొదలగు వ్యవహారములకన్న మొగలులకును రాజపుత్రులకును సంబంధబాంధ

వ్యములు ఏర్పరచినచో భిన్నభిన్నములగు నీ రెండుజాతుల కును మిత్రభావ మతిశయించుటయేగాక బంధుభావము గూడ స్థిరపడునని ఆతని యాశయము. అందులకు తానే ముందుగా మార్గదర్శకు డగుట యుక్తమని యెంచి అతడీ వివాహమున కంగీకరించెను.

ఇట్టి వివాహాదులవలన రాజపుత్రులకు మొగలుసింహా సనము నెడ ఆదరాభిమానములు వృద్ధినొందునని అక్బరు నాశయము. కాలక్రమమున ఫలితముగూడ నట్లే పరిణ మించినది. ప్రప్రథమమున నొక రిద్దరు రాజపుత్రరాజులు తమ కిష్టములేకున్నను భయముచేత చక్రవర్తికి తమ కన్య కల నొసగిరి. కొంతకాలము గడచినతరువాత వారికి తద్విషయమున అనిష్టమును అవమానభావమును అంత రించినవి. చివరకు ఓడిపోయిన రాజపుత్రరాజు లెల్లరును పాదుషాకు తమ కన్యల నొసగుట నియమము క్రిందికి వచ్చి నది. అంతియే కాక మొగలులకు కన్యకల నొసగుట యనునది గౌరవహేతువుగా నేర్పడినది.

అక్బరుచక్రవర్తి ఆహ్వానించినంతనే అంబరురాజు లొంగిపోయి పతితుడయ్యెను. ఇక మార్వారు మిగిలినది. చితోడు నాశనమైన తరువాత మార్వారువంతు వచ్చినది. మార్వారురాజు మాలవదేవుడు. అత డానాటికి వృద్ధుడుగా నుండెను. అతడు యౌవనమందును ప్రౌఢవయస్సునందును మహాయోధ యని విఖ్యాతినొందినవాడు. యుద్ధక్షేత్ర

మున షర్షాను పరాభూతుని జేసినవాడు. కాని ఇప్పుడా యౌవనమందలి సాహసము గాని సామర్థ్యము గాని లేవు. ఆ సమయమున నావార్ధకములో పూర్వమువలె నిపుణముగా యుద్ధముచేయుటకు గాని చేయించుటకు గాని యతనికి శక్తిలేదు. అతని పుత్రుడగు ఉదయసింహుడు వీరుడు కాడు. పైన నతిస్థూలకాయుడు. అతనిని 'మోటా ఉదయుడు' అని అందరును పరిహసించెడివారు. మాలవదేవుడు యథాసాధ్యముగా యుద్ధము చేసెను; కాని పరాభూతుడయ్యెను. అప్పు డతడు విధిలేక పుత్రుడగు 'మోటా ఉదయుని' అక్బరు దర్బారుకు పంపించెను. పాదుషా తన కోరిక నెరవేరుటచే ఉదయుని సాదరముగా సమ్మానించెను. 'మోటా ఉదయుడు' మొగలుల యధీనత క్రింద రాజయ్యెను.

ఆ సమయమున మార్వారురాజ్యము దుఃఖసముద్రమున మునుగ మాలవదేవుడు మరణించెను. మార్వారు పతనమువలన అత డనుభవించిన యమయాతన అతని చితాగ్నియందు శాంతి నొందినది. ఉదయసింహుడు తక్కిన రాజుల పద్ధతి ననుసరించి అక్బరుపాదుషాకు తన కుమారి నొసగెను. అందుకు ప్రతిఫలముగా పాదుషా ఉదయునకు మార్వారురాజ్య మంతయు తిరిగి యిచ్చుటయే కాక పరిసర ప్రదేశము లనేకములు తద్రాజ్యభుక్తములు గావించెను. అందువలన నతనికి సామ్రాజ్యవృద్ధి సంఘటిల్లెను.

౨౩

చూచుచుండగనే అంబరు మార్వారురాజ్యములు మొగలులకు స్వాధీనము లయ్యెను. ఆదేశ ప్రభువులకు మొగలుల సంపర్కమువల్ల సుఖము శాంతి ఆదాయవృద్ధి మొదలగునవి యన్నియు లభించినవి. ప్రతాపసింహు డది యంతయు తిలకించెను. అయినను అతడు హిమాచలము వలె అచంచలుడుగా నుండెను. మొగలుల ప్రలోభనము సామాన్యమైనది కాదు. కాని యీ భూమండలములో నెందరు రాజులు సామాన్యస్వాతంత్ర్యమునకు బదులుగా నిట్టి సమ్రాడనుగ్రహమును అనాయాసలభ్యమైన రాజ్యాధికారమును పొందుట కిష్టపడకుందురు ?

అట్టి విషయములందే ప్రతాపుని మహాత్వ మతిశయించినది. అతని మూలమంత్రము రాజధానీసముద్ధరణము. అతడు సామాన్య ప్రలోభమునకు వశుడై రాజపుత్రకులమునకు కలంక మాపాదించువాడు కాడు. అతడు జన్మించినది వీరకులమునందు. అట్టియెడ ప్రాణభయముచేత సమ్రాడనుగ్రహప్రార్థి యెట్లు కాగలడు! సుక్షత్రియుడు మరణమునకు భయపడడు. అతని ప్రతిజ్ఞ పాదుషాకు తల వంచకుండుట యొకటియే కాదు - ఎంత కాలమైనను రాజధాని నుద్ధరించి తీరవలయుననుట గూడ!

అక్బరుపాదుషా కూడ నిట్లు తీవ్రముగా నాలోచింప నారంభించెను : "రాజపుత్ర స్థాన మంతయు నాకు స్వాధీన మైనది. కాని ప్రతాపసింహుడు చిత్తోడు పోగొట్టుకొన్నను మేవాడు కోలుపోయినను స్వతంత్రుడుగా నున్నాడు. అతనిని స్వాధీనపరచుకొని తీరవలయును. మేవాడు రాజ్యము రాజపుత్ర స్థానమునకు శిరస్సు వంటిది. అట్టి మేవాడు నాయధికారము నంగీకరింపకున్న రాజపుత్రస్థానము మొగలులకు వశమైన దనుట యెట్లు పొసగును? ఏ వ్యక్తి అతి సామాన్యమైన సైనిక బలముతో ప్రబలుడైన మొగలు చక్రవర్తికి విరుద్ధముగా కత్తిగట్ట సాహసించెనో అట్టి వీర పురుషుని మొగలు రాజాస్థానమునకు అవశ్యము కొని తేవలసినదే!"

౬

ప్రలోభమును నిగ్రహించుటకు విశేషశక్తి కావలయును. అది తన సహజశక్తితో నందరి యొద్దకును సమాన భావముతోనే వచ్చును. కాని దాని నెందరు ప్రతిఘటింప గలరు? ప్రతాపుడు మహాపురుషు డగుటచేత మొగలుల ప్రలోభమునకు వశీకృతులై వారి యధికారము నంగీకరించిన తోడి రాజపుత్రుల ఆదరాహ్వానముల కార్ద్రచిత్తుడు కాలేదు.

ప్రతాపుని కనిష్ఠసోదరు డగు సాగరజీ కూడ రెండు మూడు దినముల వరకును అట్టి వంచనకు వశవర్తి కాక

ఆత్మరక్షణము కావించుకొనెను. కాని చివరకతడు నిగ్రహించుకొన లేకపోయెను. ఉన్నత రాజకీయపదవికిని విలాసభోగములకును దురాశపడి అక్బరుపాదుషాకు తన స్వాతంత్ర్యమును విక్రయించుకొనెను.

సాగరజీ కుమారులలో నొకడు మునల్ మాను డయ్యెను. అతని మునల్ మాను నామము ఇతిహాసమున ప్రసిద్ధి నొందిన మహాబత్ ఖాను అనునది. మహాబత్ ఖాను జహంగీరు పాదుషావద్ద ప్రధానసేనాధిపతిగా నుండెను. ఒకానొక సమయమున నతడు సామ్రాజ్యము మీదను సకల సేనాసమూహము మీదను సంపూర్ణాధిపత్యము వహించెను. సాగరజీ ఉదయపురమందే యుండినచో నతడును నతని పుత్రుడును ప్రతాపున కత్యంత సహాయులుగా నుండెడివారు. అంతే కాక మేవాడునకు గొప్ప బలముగా నుండెడివారు. కాని విధివిడంబనమువలన నా బలము ప్రతాపునకు ప్రతికూలముగా ప్రయోగింపవలసిన దయ్యెను.

ప్రతాపుని సోదరులలో నందరికంటెను బలవంతుడును వీరుడును శాక్తసింహుడు. కాని దైవదుర్విపాకమువలన నతడు ప్రతాపునకు విరోధి యయ్యెను. శాక్తసింహుడు జన్మప్రభృతి యుద్ధతప్రకృతి కలవాడు. కోపము వచ్చినచో అతనికి మంచిచెడ్డలు గాని గౌరవలాఘవములు గాని తెలియవు. కాని యతనికి రెండు సుగుణములు కలవు: ఒకటి గుణగ్రాహిత, రెండవది నిర్భీకత. నిర్భయు డగుటచేత నతడు దుస్సాహసికకార్యము లనేకము లొనర్చియుండెను.

అయిదేండ్ల బాలుడై యుండగా నత డొకనాడు ఆయుధాగారమునకు బోయి ఆయుధముల పదును పరీక్షించు టకై కత్తి యొకటి తీసి చేతిలో గ్రుచ్చుకొనెను. చేతికి పెద్ద గాయమై రక్తము స్రవించుచున్నను అత డేడువలేదు సరి కదా మొగమైనను ముడిచికొనలేదు. మీదు మిక్కిలి 'కత్తికి మంచి పదును ఉన్నది' అని మెచ్చుకొన జొచ్చెను. అది చూచి ఆయుధాగారాధికారు లాశ్చర్య మొంది అతని సాహసమును ప్రశంసించిరి.

శాక్తసింహుడు జన్మించినపుడు బ్రాహ్మణదైవజ్ఞు డొక డతని జాతకము పరిశీలించి, "ఇతడు స్వదేశ ద్రోహి యగును" అని జోస్యము చెప్పెను. అతని యుద్ధత స్వభావ మును అసమాన సాహసమును గ్రహించి దైవజ్ఞ వాణిని వ్యర్థము చేయ దలచి స్వదేశ కంటకుని తొలగించుటకై రాణా ఉదయసింహుడు అతనికి ప్రాణదండనము విధించెను.

ముసలి సర్దారు సాలుంబ్రా రాణాకు మిగుల ప్రియ పాత్రముగా నుండెను. వాస్తవముగా సాలుంబ్రా వంటి ప్రభుభక్తి పరాయణలును, విశ్వాసయోగ్యలును యుద్ధకుశ లులును మేవాడు దేశములో చాల తక్కువమంది కలరు. ఆ వృద్ధయోధ అతికరుణముగా ప్రార్థింప రాణా దయార్ద్రి హృదయుడై శాక్తసింహు నాసర్దారు రక్షణమునం దుంచెను.

౭

తండ్రి మరణించిన తరువాత ప్రతాపసింహుడు సింహాసన మధిరోహించి శక్తసింహుని మరల రాజసభకు రప్పించెను. అన్నదమ్ము లిరువురును మిగుల సాహసులు. అస్త్రవిద్యయందు సమాన కుశలులు. స్వభావములందును ఆశయము లందును ఆలోచన లందును ఆచరణములందును ఒకటే రీతి గలవా రగుటచేత ఇరువురకును పరస్పరము గాఢానురాగ మేర్పడెను. ఉభయులును నొక్క చోట భుజిం చుచు నొక్కచోట విహరింప దొడగిరి.

ఒకనాడు వా రిద్దరు మృగయార్థ మరణ్యమున కరిగి పారిపోవు పందిమీద నిరువురును బాణములు విడిచిరి. ఒక బాణము తగిలి వరాహము మరణించెను. అప్పు డన్నదమ్ముల కిరువురకును కలహము కలిగెను. 'నా బాణము తగిలిన' దని యొక డనగా, 'కాదు, నా బాణము తగిలిన' దని యింకొకడు తర్కించెను. ఆ తర్కమునకు నిర్ణయము తేలలేదు. అందు వలన నిరువురి హృదయాకాశము లందును కాలమేఘ సంచార మారంభ మయ్యెను.

జగమల్లుడు ప్రతాపుని కనిష్ఠసోదరుడు. రాణా ఉదయ సింహుడు తన రాణు లందరికన్న జగమల్లుని జనని నెక్కు వగా ప్రేమించెను. ఆ కారణమున నత డవసానకాలమున జగమల్లుని సింహాసనాధిష్ఠితుని గావించెను. ఉదయసింహుడు

మరణించిన తరువాత సర్దారు లందరును జగమల్లుని దుర్జనత్వ మును విలాసప్రియత్వమును జూచి అతనిని పదచ్యుతుని గావించి ప్రతాపసింహుని రాణాగా నభిషిక్తు నొనర్చిరి. అందుచేత జగమల్లుడు లోలోపల ప్రతాపు నెడ వైరభావము పోషించుకొన సాగెను. కాని దానిని ప్రకాశము చేయుటకు సాహసింప లేదు.

ఇపుడు శాక్తసింహ ప్రతాపసింహులకు వివాదము ఘటిల్లుటచేత జగమల్లు డది తగిన తరుణముగా నెంచి శాక్త సింహుని పక్ష మవలంబించెను. జగమల్లుడు శాక్తసింహుని చెంత జేరి ప్రతిదినమును, "శాక్తసింహా! ప్రతాపుని తోడి వైరమునకు జంకుచున్నావా? అతడు నీకన్న పరాక్రమ వంతుడు కాడు ఆయుధము ధరించి బలాబలములు పరీక్షిం చుకొనుటకై ఒక్కసారి అతని నాహ్వానించి చూడుము. ఒక్కముహూర్తములో నీశక్తి నీకే విశదమగును" అని అతని నుత్తేజితు నొనర్చుచుండెను. విధివిధానము నుల్లంఘించుట కెవరికి సాధ్యమగును? ప్రతాపు డొక్కడే స్వదేశోద్ధరణము కొరకు కష్టనిష్ఠురములు దుఃఖ దైన్యము లనుభవింపవలయు ననియు నతనికి సహాయు లెవ్వరు నుండ రనియు నీశ్వర నిర్ణయము కాబోలు! ఘటనాచక్రక్రమమున సోదరుడు సోదరునకు విరుద్ధముగా కత్తిగట్టుట తటస్థించెను. పర్యవ సానమున శాక్తసింహుడు ప్రతాపునుండి విడిపోయెను.

## ౮

ఆ వియోగ మిట్లు సంభవించెను: పంది వేట నాటి జగడము తరువాత కొలది కాలమునకు ఏదియో యుత్స వము వచ్చెను. ఆ సందర్భమున మేవాడు వీర వరులు తమ తమ యుద్ధ ప్రావీణ్యమును అస్త్రకౌశలమును ప్రదర్శించు టకై రాజధాని మైదానమందు సమావేశమైరి. ఆ యుత్సవ సమయమున రాణా కూడ సామాన్య రాజ పుత్ర వీరునివలె తన యస్త్రనైపుణ్యము ప్రదర్శింపవలయును. ప్రతాప సింహుడును శాక్తసింహుడును శస్త్రాస్త్ర సజ్జితులై క్రీడా రంగమందు ప్రవేశించిరి.

అంతట అన్నదమ్ము లిరువురును వీరసమక్షమున నించుక తడవు అస్త్రచాలననైపుణి ప్రదర్శించిరి. అంతలో శాక్తసింహు డించుక ఉద్రిక్తు డయ్యెను. ఆ సమయము గమనించి జగమల్లుడు శాక్తసింహునకు పందివేటనాటి పలుకులు జ్ఞాపకము చేసెను. అంతటితో నూరకుండక, “క్షత్రియుడైనవాడు యుద్ధమున కెన్నడును భయపడడు. విజయమే వీరున కలంకారము, కీర్తియే శాశ్వతము” ఇత్యాది మర్మభేదక వాక్యములు పలుకసాగెను. ఎండుకట్టె లందు నిప్పు పడినంతనే భయంకరములైన మంటలు బయలు దేరునట్లు జగమల్లుని వాక్యసమిధలు ఆజ్యధారలై ఉద్ధత

స్వభావు డగు శాక్తసింహుని క్రోధాగ్నిని ద్విగుణముగా ప్రజ్వలింపజేసెను.

అవుడు శాక్తసింహుడు తటాలున ప్రతాపునెదుట నిలిచి వంది వేటనాటి మాట లుగ్గడించి, "కుంతయుద్ధమున నెవరు ప్రవీణులో ఇవుడు నిర్ణయము కావలయును" అని యతని నాహ్వానించెను. ప్రతాపుని మనస్సులో వేటనాటి నిశ్చయవిషయమున కుతూహల మింకను నిలిచియున్నది. అటుపైన నేటి క్రీడావిశేషమున నతని మానస ముద్వేజిత మైనది. ఇక దాని పరిణామ మూహింప నవసరము లేదు. ఆహ్వానించినది తడవుగా నిరువురకును ఈటెల పోరాట మారంభమయ్యెను.

ప్రతాపసింహ శాక్తసింహు లిరువురును యుద్ధైక మన స్కులై ఏ ప్రదేశమున నే యధికారముతో దేనిని దర్శింప వచ్చి యుండిరో మరచి పోయిరి. కుంతచాలనమున ప్రతిపక్షి నోడించుటయే వారికి ప్రధానలక్ష్య మయ్యెను. శాక్త సింహుడు కేవల మొక్క జ్యేష్ఠసోదరుని మీద నస్త్రము ప్రయోగించుట అను విషయము నే కాక తన జన్మభూమి యగు మేవాడుకు రాణా అయిన ప్రతాపునితో యుద్ధమున కుద్యుక్తుడైన సంగతి కూడ పూర్తిగా మరచినాడు. ఇక ప్రతాపుడు కూడ మేవాడ రాజ్యమునకు తాను రాణా అని కాని, ప్రజా పాలనమే తన ధర్మ మని కాని, ప్రజా సంహా రము కర్తవ్యము కాదని కాని ఆలోచింప లేదు సరి గదా

శాక్తుడు కేవలము తన సోదరుడను సంగతి కూడ మరచి పోయినాడు.

క్రోధపిశాచ మావహించినప్పు డెవ్వరికైనను మనో వృత్తి స్థిరముగా నెట్లుండ గలదు? అసంభావ్యమైన శాక్త ప్రతాపసింహుల ద్వంద్వయుద్ధము జూచి చుట్టు నున్న జను లందరు విస్మితు లగుటయే కాక ప్రమాదము సంభవింప నున్న దని గ్రహించి, "ఇదియేమి? ఈ దైవ దుర్విపాకము భయంకరముగా నున్నదే! చివర కిది విషమముగా పరిణ మింపదు గదా!" అని యాందోళన పడ దొడగిరి.

సోదరు లిరువురు డాలు లడ్డము పెట్టుకొని మొదటి యాక్రమణమునుండి సంరక్షించుకొనిరి. తరువాత నిరువు రును వెనుక వెనుకకు బోయి మరల నాక్రమించుటకై విద్యు ద్వేగముతో రాబోవుచుండిరి. ఇంక నొక్క ముహూర్త ములో నుభయులును నుభయుల యీటెపోటులకు గురి యయ్యెడివారే! కాని అట్లు జరుగలేదు.

హఠాత్తుగా దివ్యపురుషు డొకడు ప్రతిపక్షుల నడి మికి వచ్చి నిలుచుండెను. అతనికి పొడవైన గడ్డము మీస ములు గలవు, మెడలో యజ్ఞోపవీతము మెరయుచుండెను. శరీరము రక్తరంజితము. అతడు చేతులెత్తి మేఘగంభీర స్వరముతో, "ప్రతాపసింహా! ఆగుము. మేవాడరాజా! ఆగుము. శాక్తసింహా! ఆగుము. కుమారా! ఆగుము"

అని కేక లిడుచుండెను. ఆతడెవ్వడో కాదు - రాజపురోహితు డగు బ్రాహ్మణోత్తముడు !

సోదరు లొకరి నొకరు చంపుకొన్నచో దేశమున కరిష్టము వాటిల్లు నను భయముచే నా బ్రాహ్మణోత్తముడు స్వదేశరక్షణార్థ మా ప్రతికక్షుల నడుమ నిలువబడెను. పోటరు లిరువురును మహావేగముతో నొండొరులమీదికి వచ్చుచుండుటచే వారి యీటెలు తనకు గ్రుచ్చుకొను ననియు, అందువలన రాజవంశమునకు బ్రహ్మహత్యా దోషము చుట్టుకొను ననియు నొక్క క్షణములో గ్రహించి, ప్రక్కనున్న యోధుని ఖడ్గము లాగి తన హృదయములో గ్రుచ్చుకొని యా బ్రాహ్మణోత్తముడు చీత్కారము చేయుచు మరుక్షణమున నా సోదరుల నడుమ ప్రవేశించెను.

ప్రేక్షకులును సర్దారులును పురోహితుని చుట్టుకొనిరి. ప్రతాపశాక్తసింహులు నిర్వాక్కులై నిస్తబ్ధులైరి. వారి మాత్సర్యావేశము చటుకున చల్లారెను. "అయ్యో, ఎంత దుష్కార్యము చేయ సమకట్టితిని" అని ప్రతాపుడు తన్ను తాను నిందించుకొన దొడగెను. చూచుచుండగనే రాజపురోహితుని వక్షమునుండి రక్త మధికముగా స్రవింప జొచ్చెను. అతని కంఠము రుద్ధ మగుచుండెను.

అప్పు డా బ్రాహ్మణోత్తము డతిప్రయత్నము మీద ప్రతాపుని హస్తము పట్టుకొని, "వత్సా! ప్రతాపసింహా! నిన్ను నీవు మరచి పోరాడుచున్నావు. కుమారా! శాక్త

సింహా! నీ మాత్సర్యము పితృసమాను డగు జ్యేష్ఠసోదరుని మీఁదనా! ఎంత అనుచితము! కుమారులారా! మీ యప్రతిమాన శౌర్యమునకు లక్ష్యము మాతృదేశోద్ధరణము! మీ విక్రమమునకు లక్ష్యము స్వాతంత్ర్య స్థాపనము! మీ తేజోవిభవమునకు లక్ష్యము ధర్మపరిపాలనము! అంతే గాని తుచ్ఛమైన మాత్సర్యము కాదు – కాఁగూడదు! మీ రొండొరులను హింసించు కొందురని గ్రహించి అట్టి నాశము నివారించుటకై నేను మీ నడిమికి వచ్చితిని. మీ యీఁటె పోటులు తగిలి మరణించితినేని మీకు బ్రహ్మహత్యా పాతక మాపాదించిన వాడ నగుదును. అందుకోస మీ పని చేసితిని. నా కోసము దురపిల్లకుఁడు. పురోహితుఁడ నగుటచే నా ప్రభు రక్షణము నా కవశ్య కర్తవ్యమైనది. నా కర్తవ్యము నేను నెరవేర్చితిని. వేదశాస్త్రాధ్యయనము చేతను సోమపానము చేతను పవిత్రమైన ఈ బ్రాహ్మణ రక్తము నుదుట ధరించి మాతృదేశము నుద్ధరింపుఁడు! ధర్మస్వాతంత్ర్యముల రక్షింపుఁడు! ఏక లింగేశ్వరుఁడు మీకు సమస్త మంగళములను సమకూర్చుఁ గాక!" అని యాశీర్వదించి తల వాల్చెను. వర క్షణమున నతని ప్రాణవాయువులు స్వర్గవాయువులలో లీనము లయ్యెను.

ప్రతాపసింహుఁడు పశ్చాత్తాపము చేతను సంక్షోభము చేతను బ్రహ్మహత్యకు కారకుఁడ నైతి నను భయ విచారముల చేతను చాలసేపు బాలకునివలె శోకించెను. తరువాత సర్దారుల నందర రావించి వారి సమక్షమున నతఁడు

శాక్తసింహునితో నిట్లనెను: "శాక్తసింహా! నీవు దేశమునకు పగవాడ వగుదువని పూర్వము దైవజ్ఞులు చెప్పియున్నారు. అందుచేత జనకులు నీకు ప్రాణదండము విధించియుండిరి. నేను నిన్నీరాజసభకు ఆహ్వానించుట ఉచితముగా కనబడలేదు. నీ యుద్ధతప్రకృతికి ఫలితముగా నేడీ బ్రహ్మహత్య జరిగినది. ఇక నీవిచట నుండుటకు యోగ్యుడవు కావు. మేవాడునుండి వెడలిపొమ్మని నేడు నిన్నాజ్ఞాపించుచున్నాను. నేడే బయలుదేరి పొమ్ము!"

శాక్తసింహుడు సంక్షుబ్ధమనస్కుడై మేవాడు వదలిపోయెను. పోవునపు డత డిట్లు భావించుకొనెను: "జ్యేష్ఠసోదరుడు చక్కగా విచారింపలేదు. ఇది చాల నధర్మము! యుద్ధమునకు నేను ప్రేరేపించిన మాట వాస్తవమే. కాని అందుల కత డేల నిరాకరింపలేదు? అందుచేత దోష మిరువురకును సమానము. కేవలము నన్నొక్కని నేల దండింపవలెను? అందులో శిక్షాదాత నాకు ప్రతిద్వంద్వియు నాతో పాటు దోషియు నగు ప్రతాపుడా!" ఇట్లు భావించినంతనే అతని యుద్ధత స్వభావమునందు ప్రతాపు నెడ ద్వేషము భయంకరాకారము తాల్చినది. తత్ఫలితముగా నతడు ప్రతాపుని ప్రతాపము చల్లార్ప నుద్యుక్తు డయ్యెను. ప్రతాపునితో మరల యుద్ధము చేయ సంకల్పించి అందుకై యతడు మొగలు శిబిరమునకు బోయెను.

ఈవిధముగా ప్రతాపసింహుని సోదరు లందరును పరుల పాలైరి. ఇక రాజపుత్రస్థానములోని యితర రాజు

లతని పక్ష మవలంబింప లేదనిన అందు విశేష మేమి యుండును!

౯

మేవాడు సగము పోయినది. ఇంక నెప్పు డెంత పోవునో నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. మొగలుల శక్తి అపారమైనది. ఆ శక్తిలో నొకటి ముసల్మాను శాఖ. ఆ శాఖ యొకటియే మేవాడును సమగ్రముగా నాశము చేయ సమర్థమైనది. ఇక రెండవది హిందువుల శాఖ. అదియు బలహీనమైనది కాదు. రాణా వంశీయులు ప్రతాపుని సోదరులు నగు సాగరజీయు శాక్తసింహుడును మొగలు సేనానాయకులైరి.

అక్బరు పాదుషాకు ప్రధాన సేనాపతి జయపుర రాజగు మానసింహుడు. మానసింహు డొక్క యుద్ధమైనై పుణ్యమునందే ఖ్యాతి వహించియుండలేదు. అతడతి విచక్షణుడు, తీక్ష్ణబుద్ధి, రాజనీతి విశారదుడు. అటుపైన శాసన కర్త. కఠిన సమస్య కలిగినపుడు అక్బరు అతనితో సంప్రతించి అతని యాలోచనము గ్రహించుచుండును.

మొగలు రాజసభలో మానసింహున కిట్టి కీర్తి గౌరవములు కలుగుట కింకొక కారణము గూడ కలదు. అంబరు రాజ్యములో విహారీమల్లుడును అతని కుమారుడగు భగవాన్

దాసుడును ఇపుడు లేరు. భగవాన్‌దాసుని సోదర కుమారుడే మానసింహుడు. అత డిపుడు అంబరు సింహాసన మధిష్ఠించెను. భగవాన్‌దాసుని సోదరిని అక్బరు వివాహ మాడియుండెను. అందుచేత అక్బరు మానసింహునకు మేనత్త పెనిమిటి యగును.

జోధపురపు 'మోటా ఉదయుని' కొమారితను గూడ అక్బరు వివాహ మాడియుండెను. ఆ జోధపురపు బేగము కుమారుడే యువరాజగు సలీము. సలీముకు మానసింహుడు తన చెల్లెలి నొసగెను. కాగా జయపుర రాజ వంశీయు లందరు మొగలు సమ్రాట్టుకు కుటుంబ సంబంధులును నాత్మీయులు నైరి అందుచేత మానసింహుడు మొగలు దర్బారులో రాజపదవి గౌరవము శాసనకర్తృత్వము మొదలగు వానిని పొందుటలో నగ్రగణ్యుడయ్యెను.

అక్బరు అవివేకి కాడు. అతడు పాత్రునకే - ఉపయుక్తునికే సమస్తాధికారము లొసగెను. అత డావిధముగా నెవ్వ డెట్టివాడో తెలిసికొని విశ్వసించుటచేతనే అతని పరివారములోని వా రతనికోసము ప్రాణము లిచ్చుటకు గూడ వెను దీయకుండిరి. అందుచేతనే అతని శక్తిసామర్థ్యములు మరి మరి వృద్ధి నొందినవి.

మొగలు సామ్రాజ్య నిర్మాణములో రాజపుత్రులు కీలకమువంటి వారు. అందులో మానసింహునివలన అక్బరు పొందిన బలము మరి యే సమ్రాట్టును పొంది యుండలేదు. మానసింహుడు గూడ మొగలు ప్రభుత్వాభిమాని యయ్యెను.

# ౧౦

మానసింహు డొకసారి ఏదో కారణమున మేవాడు మధ్యముగా బోవుచుండెను. అతడు శత్రురాజ సేనాపతి యైనను యుద్ధప్రయత్నము లేకుండ ప్రయాణించు చుండుటచేత ఉదారు లగు రాజపుత్రు లతని మార్గమున కెట్టి యభ్యంతరమును గలిగించలేదు. అత డనాయాసముగా రాజ్య మంతయు పరిభ్రమించి పరిశీలించి పోగలిగెను. ఒక్క రాజపుత్రుడు గూడ నతనిపై చేయిచేసికొనలేదు. కారణము అతడు మేవాడురాజ్యమున కతిథి యగుటయే. సుక్షత్రియు లగు రాజపుత్రులు ఎట్టి అవస్థయందైనను అతిథి నాహ్వానింపక-సత్కరింపక అవమానింపగలరా ?

మానసింహు డుదయపుర సమీపమునకు వచ్చి కొమలమీరులో నున్న ప్రతాపసింహునకు, "నేను కొమల మీరుకు వచ్చి మీ దర్శనము చేయుదును" అని వార్త నంపెను. కర్తవ్యపరాయణు డగు ప్రతాపుడు కొమలమీరు నుండి ఉదయసాగరము వరకేతెంచి స్వయముగా మాన సింహు నభ్యర్థించెను.

ఉదయసాగరము చేరునప్పటికి రెండుజాములు దాటి నది. పర్వతమార్గములందు మండుటెండలో ప్రయాణించుట చేత మానసింహుడును నతని యనుచరులును మిగులడస్సి పోయిరి. అందుచేత నా డిన మచటనే విశ్రాంతినొంద

నిశ్చయించుకొనిరి. మానసింహు డతిథియగుటచే నతనిని తృప్తిపరచుటకై నానావిధ భక్ష్యభోజ్యములు సిద్ధములైనవి.

ఒక్క పీట మాత్రము వేసి ఆహార్యములు వడ్డించి ప్రతాపుడు మానసింహుని పిలువనంపెను. పిలువ బోయినది ప్రతాపుని కుమారుడు అమరసింహుడు. పిలుచుటకు ప్రతాపుడు రాకుండుటచే మానసింహునకు సందేహము కలిగెను. మానసింహు డే మహోద్దేశముతో మొగలు శిబిరమునుండి బహుదూరము ప్రయాణముచేసి అయాచితముగా స్వయమాహూతుడై వచ్చియుండెనో ఆ యుద్దేశ్యము సిద్ధింపలేదు. అతడించుక విరక్తుడయ్యెను; కాని కోపగించలేదు. నే డతడు దేనికైనను సహించుటకు సిద్ధపడి వచ్చియుండెను. కావున నత డమర సింహుని వెంట నరిగెను.

భోజనశాలలో నొక్కనికి మాత్ర మాహార్యములు వడ్డించి యుండుట గ్రహించి మానసింహుడు ప్రతాపసింహుని పిలువు మని అమరునితో జెప్పెను. అమరుడు పూర్వనిర్దిష్టప్రకారము, "నాయనగారికి తలనొప్పి వచ్చినది. పండుకొని యున్నారు, తమరు భోజనము చేయుడు" అని పలికెను.

ప్రతాపుని శిరోభారము సామాన్యమైనది కాదనియు హింద గౌరవమునకు సంబంధించిన దనియు మానసింహుడు వెంటనే గ్రహించెను. అతడు గొప్ప రహస్య విషయము మాటాడ వచ్చియుండెను. అందుల కీ సామాన్య

శిరోభార మంత రాయము కాదగినదా ? అప్పు డత డిట్లు నెను: "అమరసింహా! సామాన్య శిరోభారమువల్ల రాణా వంటి వీరపురుషుడు భోజనశాలలోనికి గూడ రాలేక పోయి నాడా ? రాజపుత్ర రక్త మంత శీతలమై పోయినదా ?"

అమరసింహుడు నిరుత్తరుడు.

మానసింహుడు మరల నిట్లు పలికెను : "అతిథిని గౌర వించుట అధర్మము గాని అవమానము గాని కాదు. రాజ పుత్రులగు రాణా వారు ఈ విషయము గూడ మరచి యుండుట మిగుల విచారకరము. నేటివరకును రాణా వారి యాజ్ఞానుసారమే రాజపుత్రస్థానము పరిపాలిత మగుచున్నది. అట్టి రాణావారే అతిథిని విముఖుని గావించినచో నింకొక రాజపుత్రరాజు గౌరవించునా ? ఈ విధముననే దేశము అధఃపతనము నొందినది !"

ప్రతాపుడు ప్రక్కనున్న శిబిరములో నుండెను. మాటిమాటికిని 'రాణా రాణా' అని పేరెత్తి పలికిన ఆ బక ధార్మికుని హితోపదేశ వాక్యము లతడు సహింప లేక పోయెను. తోడనే అతడు మానసింహుని యెదుటికి వచ్చి యిట్లనెను : "మహాశయా ! మ్లేచ్ఛుడగు మొగల్ సామ్రాట్టు ఎవరి మేనత్త పెనిమిటియో, మొగల్ యువరాజు ఎవరి చెల్లెలి భర్తయో అట్టి వారితో హిందువు లెన్నడును సహ పంక్తిన భుజింపజాలరు. తమరు మొగలు సంపర్కము వల్ల హిందుత్వము పోగొట్టు కొన్నారు. అంతే కాక

ఇంకొక విశేషము : తమరు తుచ్ఛమైన స్వలాభము నపేక్షించి స్వదేశమునకును స్వజాతికిని శత్రువులైనారు. స్వదేశద్రోహులతో గలిసి నే నెప్పుడును భోజనము చేయను !"

మానసింహుని కోపము భగభగ మండ నారంభించెను. "ప్రతాపు డొక్కసారి నన్ను తన జాతివానినిగా ఆదరించి నచో హైందవ సమాజములో నింక నన్ను నిరాకరించువా రెవ రుందురు ? ఒకప్పు డేదియో భ్రమపడి ముసల్మాను లతో సంపర్కము కలిగించు కొంటిని. అందుకోసము తమ కులమువానిని కులమువారు ఆదరింపక బహిష్కరింతురా ?" అను భావముతో నతడు వచ్చియుండెను. అది సఫలము కాకుండుటచే నతడు దుఃఖముతోను కోపముతోను ఇట్లు పలికెను : "రాణాజీ ! ప్రతాపసింహా ! ఒకప్పుడు నేను గూడ తమవలెనే హిందుత్వము నెడ గాఢాభిమానముతో వ్యవ హరించితిని. తరువాత ప్రారబ్ధవశమున కళంకితుడ నైతిని. నా దోషము నేను తెలిసికొని ఇపుడు మొగలుసంపర్కము వదలుకొను నుద్దేశముతో తమసన్నిధికి వచ్చితిని. తమరు నన్ను పరిగ్రహింపకున్న నా కిక గత్యంతరము లేదు !"

ప్రతాపుడు పలుక లేదు.

ఆ సమయమున నెవరో వెనుకనుండి, "ఏమి, ఎందు లకు గత్యంతరము లేదు ? తమ మేనత్తగారి మొగలుభర్త ఉన్నాడు గదా ! ఇంక తమకు భయమేమి ?" అని పలికిరి.

మానసింహుడు కన్ను లెర్రజేసి ప్రతాపుని వంక తీవ్రముగా చూచుచు నిట్లనెను: "ప్రతాపసింహా! హిందువుల కభ్యున్నతి లేదని నేడు తెలిసికొన్నాను. హిందువుల భవిష్యత్తు గాఢాంధకారమయము. వారికెప్పుడు సంకుచిత భావమేర్పడినదో అప్పుడు నే నట్టివారి యనుగ్రహము కోసము ప్రార్థింపను. ఎంతో ఆశతో తమ సన్నిధికి వచ్చితిని. రాణాజీ! నేడిట్టి యవమానము లెన్ని తటస్థించినను తలవంచి సహించియుందును - నా కోరిక సఫలమైనచో! కాని నేను వ్యర్థముగా ప్రయాసపడి వచ్చినట్లైనది ప్రతాపజీ! మరియొకసారి ఆలోచించి చూడుడు! తమరును నేనును ఏకమైనచో అక్బరుకీర్తిపర్వతమును కాలితో తన్ని చిందరవందర చేయగలము. ఇక రాజపుత్ర స్థాన రాజ్యములు తృణప్రాయములు! కాని అట్లు జరుగుట కవకాశము కనబడుట లేదు. హిందుత్వము దాని కంతరాయమైనది! తమరు నన్ను నీచముగా అవమానించితిరి, దోషము లారోపించితిరి. అందుకు తగినట్లు పగతీర్చుకొనుట మానసింహుడు మొగలు సంపర్కము వలన మరచినాడని భావింప వలదు. తమ్ము రాజ్యమునుండి వెడలగొట్టెదను. అప్పుడు తామును మావలెనే ఆశ్రయ భిక్షకోసము మొగలుల చరణ సన్నిధికి రాక తప్పదు. అట్టి దినములు శీఘ్రకాలములో తప్పక రాగలవు!"

ప్రతాపసింహుడు తృణీకారము సూచించుచు చిరునవ్వుతో, "సంతోషముతో తమ్ము యుద్ధ క్షేత్రమున

కలిసి కొందును. తమరు వచ్చునపుడు తమ ముసల్మాను బావను గూడ వెంటబెట్టుకొని దయచేయుడు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

మానసింహుడు క్రోధముతో, "అట్లే వచ్చి తమ మానము (గర్వము) దింపి మానసింహుడను పేరు సార్థకము చేసికొందును" అని గర్జించెను.

మానసింహుడు సంక్షోభముతో క్రోధముతో అవమానముతో తల వంచుకొని కన్నీరు కార్చుచు ఉదయసాగరమునుండియే వెడలిపోయెను. భోజనము చేయుటకు వీలు పడలేదు.

అక్కటకటా! ఎవని దోర్దండప్రతాపమున కాబూలు నుండి వంగదేశము వరకు హిందువులును పఠానులును భయముచేత గజగజ వణకుచుందురో, ఎవడు కను బొమ్మలు ముడిచినంత మాత్రమున నూరులకొలది మొగలు సైనికుల భాగ్యరేఖలు మారిపోవునో అట్టి మహానుభావుడు - వీరపుంగవుడు నేడు హిందుద్వారము కడ మాన్యత కొసము - తుచ్ఛములైన ప్రాణములకోసము కాదు సుమా - ఆదరణము కోసము యాచకుడయ్యెను! హైందవ సమాజపు దయాలేశముకోసము దైన్యము నొందెను!

## ౧౧

అసాధారణ ప్రజ్ఞావంతుడును అర్థబలసంపన్నుడును నగు అక్బరుపాదుషా తన కిపుడు శత్రు వని ప్రతాపుడు తెలిసికొన్నాడు - చక్కగా అవగతము చేసికొన్నాడు. యుద్ధకౌశలమునందు కాకున్నను సేనా సంఖ్య యందు మొగలుసైన్యము ముందు మేవాడ రాజసైన్యము గణింప దగినది కాదు. అసాధ్యమును సాధించుటకు ప్రవృత్తుడైనను ప్రతాపసింహు డేమాత్రమును చలింపలేదు స్వభావసిద్ధముగా వీరులైనవారు విపత్తులు రానున్న వని తెలిసియు భయము జెందరు. విపత్తు లెక్కువైనకొలది - భయంకరములైన కొలది - వీరహృదయమున తేజము వృద్ధినొందు చుండును. కాని ఎన్నటికిని చల్లారిపోవదు.

ప్రతాపసింహుడు బాల్యమునుండియు 'మనోరథసిద్ధి లేదా శరీరపతనము' అను మూలమంత్రము జపించు చుండెను. అందుచేత శత్రుపక్షమువారి కను లెఱ్ఱవారిన వని తెలిసినంతనే ద్విగుణముగా ప్రయత్నించి తన శక్తి వృద్ధిజేసికొన మొదలుపెట్టెను. రాణా కులగౌరవమును రాజపుత్ర జాతి గౌరవమును తన సర్వస్వ మర్పించి యైనను కాపాడెద నని అతడు శపథము చేసెను.

మేవాడు రాజ్యములో ప్రతాపున కిపుడు మిగిలినది సగము మాత్రమే. ఆ సగము కూడ అరణ్యములతోను

పర్వతములతోను నిండియున్నది. కర్తవ్యమును బోధించుచు, ఆదరించుచు నతడా యర్ధరాజ్యములోని ప్రజాబృందము నొక్కచోటికి చేర్ప ప్రయత్నించెను. అంతే కాక తన బలము వృద్ధి యగుటకు తగిన యత్నము లన్నియు చేయ నారంభించెను. మొగలుల అధీనమునందున్న అర్ధ రాజ్యము లోని ప్రజల నందరను అతడు తన అధీనమునందున్న రాజ్యములోనికి రమ్మని ఆదేశ మంపెను. అందువలన చక్కని ప్రయోజనము కలిగెను. స్వదేశ భక్తిగల ప్రజ లందరును నతని పర్వతారణ్యమయ రాజ్యములోనికి వచ్చిరి. రాని వారి నతడు సమయము కనిపెట్టి పట్టుకొని శిక్షించెను.

మానసింహుడు చెప్పినంత చేయగల కార్యశూరు డని ప్రతాపునకు తెలియును. అందుచేత నిక విలంబము చేయుట ఉచితము కాదని విచారించి యతడు యుద్ధమునకు సిద్ధపడ జొచ్చెను. రకరకముల ప్రయత్నించి యతడు ఇరువది రెండువేల సైన్యమును సమకూర్చెను. అల్పసంఖ్య గల ఆ సైన్యముతో కొండలు మిట్టలు గల ప్రదేశములందు కాకుండ సమప్రదేశమున విస్తారమైన మొగలు వాహినిని డీకొనుట సాధ్యము కాదని అత డెరుగును.

మేవాడులోని పర్వత మార్గము దుర్గమమైనది. ఆ మార్గ ముఖమున చిన్నమైదానము కలదు. ఆ మైదానము చుట్టును కొండ లున్నవి. ఆ బయలునకు హాల్దీఘట్ట మనిపేరు. అచట మొగలుల నెదిరించినచో అధికసంఖ్యాకు లగు మొగలు

సైనికులు ముందుకు వచ్చినంతనే అల్పసంఖ్యాకు లగు తన సైనికులు వారిని ఉఫ్ అని ఊదివేయగల రని ప్రతాపుడు నిశ్చయించుకొని యచట తన భిల్లసైన్యమును రాజపుత్ర సైన్యమును సిద్ధముచేసి యుండెను.

౧౨

మానసింహుడు ప్రతాపునెడ నత్యంతవిద్వేషము పూని ఢిల్లీకి మరలి పోయెను. ఢిల్లీ చేరినప్పటినుండియు ప్రతాపుని సర్వస్వమును హరించుటకై ఉపాయము లాలోచించుటయే అతనికి జపతపము లయ్యెను. అతని మలినభావము వలన తనకు క్రొత్తమేలు కలుగగలదని అక్బరు సంతోషించెను. రాజపుత్రస్థాన మంతయు తన యధీనము చేసికొనవలయు నని అతనికి బహుకాలమునుండియు సంకల్ప మున్నది. కాని అందుకు సమర్థుడైన సేనాధిపతి కనబడకపోవుటచేతను తన రాజ్యమం దచ్చటచ్చట కలుగుచున్న కలహముల నణచి వేయుటయందు వ్యాపృతుడై యుండుట చేతను అతడంతగా నా విషయము నాలోచింప లేక పోయెను. ఇపుడు మానసింహుని మనోమాలిన్యము వలన తగిన సమయము సమకూడినది. తోడనే అక్బరు సలీమును సేనాధిపతిగా జేసి మానసింహుని శాక్తసింహుని సాగరజీ పుత్రుడగు మహాబత్ ఖానుని అతనికి సహకారులుగా నేర్పరచి గొప్ప సైన్యమును మేవాడు మీదికి దాడి పంపెను.

మొగలు సైన్యము క్రమక్రమముగా ఉదయపురము వైపుకు వెళ్లినది. దేశ మంతయు వట్టి బయలుగా నుండెను. ఎచ్చటను ఎవ్వరును అభ్యంతరము కలిగింప లేదు. ఢిల్లీ మొదలుకొని హల్దీ ఘట్టము పర్యంతము పర్వత భూములు మైదానములు మొదలగు వానిని మొగలు సైన్యము లాక్రమించినవి. మొగలు వాహిని హల్దీఘట్టము కడకు చేరినంత నే ప్రతాపుడు దాని నెదిరించెను. ప్రతాపుని భిల్ల సైన్యము దూరమునుండి బాణవర్షము కురిపించుచు శత్రువులు సమీపించినపుడు భయంకరముగా కేకలు వేయుచు ఈటెలతో పొడవ సాగెను.

ప్రతాపుడు కూడ నూరకుండ లేదు. అతని లక్ష్యము మానసింహునిపై నున్నది. మానసింహుడు రాజపుత్ర కులాంగారము - మాతృదేశద్రోహి. అందుచేత ప్రతాపుడు నేడతనికోసము వెదకుచుండెను. ఒక్కొక్కసారి మొగలు సేనామధ్యము వరకు వచ్చి వెదకినను మానసింహుడతనికి కనిపించ లేదు.

ఇట్లొకసారి శత్రువ్యూహము నడుమ ప్రవేశించినపుడు ప్రతాపునకు ప్రధాన సేనాపతియగు సలీ మెదురుపడెను. సలీము ఏనుగు నధిరోహించియుండెను. రాజపుత్ర స్థానములోని అశ్వములలో 'చైతకము' శ్రేష్ఠమైనది. ప్రతాపుడు దాని నారోహించియుండెను. 'చైతకము' సుశిక్షితమైనది. అది తన ప్రభువు స్వభావము చక్కగా నెరుగును.

ప్రతాపుడు హుంకారము చేసినంతనే 'చైతకము' తన ముందరి కాళ్ళు రెండును ఎదుట నున్న ఏనుగు తొండము మీద నుంచెను. ప్రతాపుడు గురిచూచి సత్తువకొలది సలీముమీద ఈటె విసరెను. కాని దుర్విధి వశమున నా యీటె మావటీని చీల్చి పోయి అంబారికి గ్రుచ్చుకొనెను.

అంబారికి నాలుగువైపులను పైకి లతాపత్రములవలె కనబడునట్లు నిర్మితమైన యినుపతెర కట్టియుండెను. దాని మూలమున యువరాజున కెట్లో ప్రాణములు దక్కినవి. మావటీడు మరణించినాడు. ఏనుగు ఉన్మత్తమై వెనుకకు దిరిగి పారిపోవ మొదలిడెను. దాని కాళ్లక్రింద పడి నూరుల కొలది మొగలు సైనికులు హతులైరి. ప్రధాన సేనాధిపతికి తటస్థించిన దురవస్థ జూచి వర్షధారలవలె మొగలు సైనికులు నాలుగు వైపులనుండి వచ్చి క్రమ్ముకొనిరి. వారందరు గలిసి ప్రతాపుని ముట్టడించి యుద్ధము చేయసాగిరి.

రాజపుత్రుల సర్దారులు రాణా విపత్తును గ్రహించి వెంటనే అతని కడకు వచ్చిరి. ప్రతాపుడు రాజవేషముతో రాజచ్ఛత్రముతో రక్తపతాకతో యుద్ధము చేయుచుండెను. అందువలన శత్రువులు 'అతడే మేవాడు రాణా' అని సులువుగా తెలిసికొని మాటిమాటికిని అతనిని చుట్టుకొని యుద్ధము చేయ జొచ్చిరి.

కాని యీరీతిగా యుద్ధ మెంత కాలము సాగ గలదు? ఎన్ని సారులు ఎంతమంది రాజపుత్రుల సర్దారులు శత్రువుల

యీాటెలకును కత్తులకును తుపాకి గుండ్లకును తమ ఎదురు రొమ్ము లెదురొడ్డి ప్రతాపుని బ్రతికించి రక్షించిరి ? స్వల్ప మైన రాజపుత్ర సైన్యము దాదాపుగా నంతయు గతించినది.

ప్రతాపు డంతవరకును ప్రాణములు లెక్కసేయక యుద్ధము చేయుచుండెను. అతని శరీరమున కెన్ని దెబ్బలు తగిలినవో లెక్కలేదు. ఒకచోట కత్తిదెబ్బ తగిలినది. ఇంకొకచోట ఈటె చీల్చుకొని పోయినది. మరియొకచోట తుపాకి గుండు దూసుకొని పోయినది. ప్రభుభక్తి గల 'చైత కము' కూడ నట్టి యవస్థలోనే ఉన్నది. అయినను ప్రతాపుడు తన యశ్వ మెట్టి స్థితిలో నున్నదో తెలిసికొనుటకై దృష్టి మరల్చి చూడనైన చూడలేదు. 'చైతకము' కూడ ఎగిరి యెగిరి శత్రువులను నలగద్రొక్కుచు ముందుకు పోవుచుండెను. ప్రతాపుడు నిరంతరముగా ఖడ్గము త్రిప్పుచుండెను.

మొగలుసైన్యము సేనాపతి ఆజ్ఞానుసారము రాజచ్ఛ త్రమును రక్తపతాకను గుర్తు చూచుకొని గుంపులు గుంపులుగా వచ్చి చుట్టవేయుచుండిరి. మొగలుసైనికు డొక్కడు పడిపోయినచో వాని స్థానమున పదిమంది వచ్చి చేరుచుండిరి. ఈ విషయము రాజపుత్రుల సర్దారులు గమ నించిరి. "రాణా ఇంక నిల్లెంత కాలము యుద్ధము చేయ గలడు ? మానవు డెంత చేయగలడో అత డంతకన్న నధిక ముగా చేసినాడు. కాని యిక చేయలేడు" అని తెలిసికొనిరి. తోడనే ఝూాల్లాసర్దారుని ఆజ్ఞ ననుసరించి రాజపుత్రులు

గుఱ్ఱముతో గూడ ప్రతాపుని మరలించి యుద్ధక్షేత్రమునకు బహు దూరముగా గొనిపోయిరి. ఝాల్లాసర్దారు స్వయముగా రక్తపతాక కెడమవైపున రాజచ్ఛత్రముక్రింద నిలుచుండి యుద్ధము చేయ నారంభించెను.

మొగలుసైన్య మీ పరివర్తనము గమనింపలేకపోయినది. అందుచేత నా సైనికులు మహాపరాక్రమముతో వచ్చి రాజచ్ఛత్రముమీద బడిరి. ఝాల్లాసర్దారు ప్రాణములున్నంతవరకును యుద్ధము చేసి ప్రభువు ప్రాణములు కాపాడి వీరునివలె తన ప్రాణము లర్పించెను.

ప్రతాపుని మరలించి కొనిపోవు వరకును ఆతనికి బాహ్యజ్ఞాన మున్నది. అత డంతవరకును, "స్వదేశ కంటకమును పెకలించివైచి మరణించినను మంచిదే!" అని పలుకుచుండెను. తరువాత నతనికి స్మృతి తప్పినది. కొంత సేపటివరకును నతడు చనిపోయిన వానివలె పడియుండెను. మరికొంత సేపటికి తెలివివచ్చి కనులు తెరచి చూచెను. రాజపుత్ర సైనికు డొక్కడును కనిపించ లేదు. కుడివైపునను ఎడమవైపునను శవములే! ఎటు చూచినను మనుష్య శవములు స్తూపాకారములుగా పడియున్నవి.

అప్పు డచట నా యవస్థలో నుండి ఇంకను తన సైన్యము కొరకు నిరీక్షించుట నిష్ప్రయోజన మని భావించి 'చైతకము' మీద గూర్చుండి దానిని పర్వతమార్గము వైపుకు త్రిప్పెను. తోడనే ఆ యశ్వ మా మార్గమున నతనిని

ఉదయపురము వైపు కొని పో సాగెను. పోవునపుడు ప్రతాపుడు, "ఎట్లైనను ఎంత ప్రయత్నించినను మొగలులు పర్వత దుర్గముల నాక్రమింప లేరు గదా!" అని భావించెను. అతడు పోవుచుండుట కనిపెట్టి యిరువురు ముసల్మాను సైనికు లతని వెంట బడిరి.

## ౧౩

శక్తసింహుడు కూడ యుద్ధము చేసినాడు. కాని యతడు ప్రతాపుని యెదుట బడలేదు. దూరమందుండి అతని తేజమును విక్రమమును తిలకించుచుండెను. అతని సాహసమును ఉత్సాహమును దృఢప్రతిజ్ఞను నేత్ర పర్వముగా చూచి మెచ్చుకొనుచుండెను. ప్రతాపుడు తన జ్యేష్ఠ సోదరుడు అను విషయము మనస్సునకు వచ్చినంతనే అతని కనులనుండి అశ్రుధారలు బయలువెడలెను. తన సోదరుడు మాతృదేశ మగు మేవాడు కొరకు ప్రాణము లర్పింప సిద్ధముగా నున్నాడు. ఇక తానో, తుచ్ఛమైన అహంకారముతో పామరమైన అతిశయముతో తన జన్మభూమి యగు మేవాడుకు విరుద్ధముగా ఖడ్గము ధరించినాడు. ఇట్టి భావము హృదయమునకు తోచినంతనే అతనికి మర్మాంతకమైన బాధ కలిగెను. "అట్టి మహనీయుడగు ప్రతాపసింహునకు సోదరుడనై పుట్టి రాజపుత్ర తేజమును హృదయమున వహించి

నాకులమునకును నాజాతికిని నాదేశమునకును నామతమున కును శత్రువులగు మొగలుల చరణము లాశ్రయించితిని గదా” అని యతడు వాపోయెను. నేడు శాక్తసింహుడు అభిమానము కోసము కాక అనుతాపముచే బటబట కన్నీరు కార్చ దొడగెను.

సరిగా నాసమయమున మొగలు శిబిరమునుండి జయ జయ ధ్వనులు చెలరేగెను. ఆధ్వని వినబడినంతనే శాక్త సింహుడు దులికిపడి నలుదెసలు పరికించెను. ప్రతాపుడు తన నీలాశ్వము - చైతకము మీాద హాల్దీఘట్టము నతిక్రమించి పర్వతమార్గమున బడి పోవుచుండెను. అతనిని పట్టుకొనవలె నని వెనుకనుండి తురుష్కసైనికు లిరువురు వెంబడించుచుండిరి. అది చూచి శాక్తు డిక నాగలేకపోయెను. తోడనే యతడు తన గుఱ్ఱమును మరలించి తురుష్కసైనికుల వెంట బడెను. శిబిరమునుండి మొగలుసైన్య మీా దృశ్యము పరికించినది. పరికించి శాక్తసింహుడు బహుమానాపేక్షతో ప్రతాపుని పట్టుకొన బోవుచున్నాడని భావించినది.

రానున్న విపత్తు నప్పుడే ‘చైతకము’ పసిపట్టినది. తోడనే ఆ యశ్వరత్నము తన సత్తువ నంతయు కూడ దీసికొని ప్రాణపణముగా ప్రతాపుని మోసుకొని పరువెత్త నారంభించినది. ‘చైతకము’ శరీర మంతయు గాయములు పడియుండుటచే రక్తము ధారలుగా స్రవించుచుండెను. దాని కెన్ని గాయములు తగిలినవో లెక్క లేదు. దాని రక్తధారలతో

పర్వతమార్గము రంజిత మగుచుండెను. అయినను అది లక్ష్య పెట్టుట లేదు. అట్లే ఆ 'చైతకము' తన ప్రభువు ప్రాణములు రక్షింప పరువెత్తు చుండెను.

'చైతక' మెట్టి యవస్థలో నున్నదో ప్రతాపుడు కూడ నట్టి యవస్థలో నున్నాడు. అతని శరీర మంతయు భగభగ మండుచు కంపించుచుండెను. బాహువులు ఊరువులు వక్షము వస్త్రము రక్తరంజితములు. పోవుచుండగా ప్రతాపునకు కొండవాగు అడ్డమువచ్చెను. ప్రతాపు డా బలహీనావస్థలో ఎట్లో అతికష్టముమీద ఆనదిని దాటెను. కాని నదిని దాటిన తరువాత చైతక మిక కదలలేక కంపించుచు భూమిపై బడెను. ప్రతాపుడు తోడనే నదినుండి జలము గొనివచ్చి చైతకమును త్రాగించెను. చైతకము ఒక్కసారి తలయెత్తి తన ప్రభువు ముఖమువంక చూచి కాతరసూచకముగా అస్ఫుటముగా హేషించి ప్రాణములు వదలెను. ప్రతాపుడు బాలకునివలె రోదించెను. ఒకసారి భూమిపై బడి పొర్లాడెను. ఇంకొకసారి చైతకము మృత దేహమును గట్టిగా కౌగలించుకొనెను.

ప్రతాపుని వెంబడించుచున్న మొగలుసైనికు లిరువురును కొండవాగును దాటలేక శాక్తసింహునికోసము నిరీక్షింపసాగిరి. కాని నేడు శాక్తుని భావము మారినది. అత డచటికి వచ్చి మొగలుసైనికుల నాక్రమింపదొడగెను. అప్పుడా ఖురాసానీ ములతానీ సైనికు లిరువురును విస్మితులై

ఆత్మరక్షణార్థ మతనితో యుద్ధము చేయవలసి వచ్చెను. కాని వా రిద్దరైనను శాక్తసింహునితో ఎంతసేపు యుద్ధము చేయగలరు ? వా రొక్కొక్కరుగా నిహతులైరి

అపుడు శాక్తసింహుడు "ఓనీలహయారోహి!" అని బిగ్గరగా కేక వేసి నదిని దాటి ప్రతాపుని సన్నిధికి వచ్చెను. కేక విని ప్రతాపుడు సంబాళించుకొని లేచి చింతాకుల భావముతో శాక్తుని రాకకై ప్రతీక్షింపసాగెను. శాక్తుడు సమీపించినంతనే ప్రతాపు డిట్లనెను. "ఎవరు ? శాక్తసింహుడా ! తమ్ముడా ! వచ్చితివా ? ఇదిగో అస్త్రము, గ్రహింపుము - నా హృదయమున గ్రుచ్చుము. సోదరుని చేత మరణింపవలసిన విధి యున్నది కాబోలు ! అందుచేతనే నన్ను తురుష్కులచేత చావనీయలేదు. నీ కోరిక నెరవేర్చుకొనుటకు ఇంతకన్న తగిన నిర్జనప్రదేశ మింకొకటి దొరకదు."

శాక్తసింహుడు మిగుల లజ్జితు డయ్యెను. తాను రాజపుత్రు డయ్యును మొగలుల కృపాభిక్ష నర్థించి యుండెను. ప్రతాపుడు స్వదేశవత్సలు డగుటచే ఇప్పుడు గూడ నా విషయ మెత్తినా డన్న సందేహింప వనిలేదు. శాక్తసింహు డశ్రుపూర్ణలోచనుడై ప్రతాపుని పాదముల మీద బడి ఇట్లు పలికెను : "అన్నా ! నిన్ను నేను చంపుటకు రాలేదు. ఇదుగో చూడుము. నా హస్తములు ఖురాసానీ ముల తానీల రక్తముతో రంజితములైనవి. నిన్ను వెంబడించినవారిని నిహ

తుల జేసితిని. ఇపుడు క్షమింపు మని ప్రార్థించుటకును నీ పాదసన్నిధిని ఆత్మసమర్పణము గావించుకొనుటకును వచ్చి యుంటిని. నన్ను సోదరునిగా ననుగ్రహింపుము !"

ప్రతాపు డానందాశ్రువులతో, "సోదరా, సోదరా !" అనుచు శాక్తసింహుని గట్టిగా కౌగలించుకొనెను. వేరొక మాట అతని కంఠమునుండి వెడలలేదు. చాలసేపటివరకు వారిద్దరు పరస్పరసోదరానురాగ మనుభవించిరి. తరువాత శాక్తసింహు డిట్లనెను: "ఇక నాకు సెల వొసగుము. నేనొక సారి మొగలు శిబిరమునకు బోయి నాపురాతనప్రభుని వద్ద సెలవు గొని వచ్చెదను. కాని, అన్నా ! నీవు నిరాశ నొందకుము. నిన్ను ఏకలింగేశ్వరు డనుగ్రహించును!" ఇట్లు పలికి తన యశ్వమును ప్రతాపున కొసగెను. ప్రతాపుడు ప్రియమైన చైతకమును చివరసారి గాఢాలింగనముచేసి విచారముతో ఉదయపురమార్గము ననుసరించెను. శాక్తసింహుడు నదిని దాటి ఖురాసానీసైనికుని గుఱ్ఱ మెక్కి మొగలు శిబిరమునకు బోయెను.

## ౧౪

శాక్తసింహుడు మొగలు శిబిరమునకు వచ్చెను. నేడతని ముఖభంగి గంభీరముగా నున్నది. "ప్రతాపసింహుడేడీ ? ఖురాసానీ ములతానీ సైనికు లేరీ ?" అని నలువైపుల

నుండి అనేకులు ప్రశ్నించిరి. శాక్తసింహుడు నిరుత్తరుడు. అతడు తన అనుచరులను మిత్రులను వెంట నిడుకొని ప్రధాన సేనాపతి యగు సలీము కడ కరిగెను. శాక్తసింహుడు ప్రతాపుని బందిగా గొని రాలే దని సలీము గ్రహించెను. శాక్తుని భావము ఉన్మత్త ప్రాయము. అందుకు కారణ మడుగుచు సలీ మిట్లు ప్రశ్నించెను: "శాక్తసింహా! మీరు వీరులు, మీరు మొగలులకు ప్రధానసహాయులు. నేడు మీకిట్టిభావము కలుగుటకు కారణ మేమి? జరిగిన వాస్తవము చెప్పుడు. మిమ్ము నేమాత్రము దోషిగా గ్రహింపను."

అపుడు శాక్తసింహు డిట్లనెను: "యువరాజా! నా అంతరాత్మ ప్రబోధించిన దానిని చేసితిని. అది తమకు అన్యాయముగా తోచవచ్చును. తమ రంతయు విని తమ ఇష్టప్రకారము చేయవచ్చును. నేను చేసినదాని ఫలము అనుభవించుట కెప్పుడును భయపడను." తరువాత శాక్తసింహుడు ఖురాసానీ ములతానీ సైనికులను హత మొనర్చుట, ప్రతాపుని రక్షించుట మొదలగు సందర్భము లన్నియు విప్పి చెప్పి మరల నిట్లనెను: "ప్రతాపసింహుడు నా సోదరుడు. నా సోదరునకు విపత్తు కలిగినపుడు అందులో అట్టి మహావీరునకు ఆపద సంభవించి నపుడు నా కర్తవ్యమును నేను నెరవేర్చితిని. అందుకోసము నా కించుకయు పశ్చాత్తాపము లేదు."

సలీము చాల సేపటివరకు జరిగిన వ్యాపార మంతయు విచారించి ఇట్లనెను: "ప్రతాపసింహుడు మీకు సోదరుడు!

మీరు మీ సోదరునకు ఉపకారము చేసి మీ హృదయధర్మ మును ప్రకటించినారు! అయినను మీరు మీ యిచ్ఛాను సారము మొగలులకు మిత్రులైతిరి. ఇప్పు డందులకు విపరీత ముగా ప్రవర్తించి కర్తవ్యభ్రష్టులైనారు. మీరు వీరులు. కనుక మీకు కొంచము కూడ శిక్ష విధింపను. కాని మీ ఈ విశ్వాసద్రోహమునకు తగిన శిక్ష సమ్ముఖయుద్ధమందు గావించెదను. మీ రిప్పుడే మొగలుశిబిరము వదలిపొండు." శాక్తసింహుడు వెంటనే తన అనుచరులను మిత్రవర్గమును వెంటనిడుకొని మొగలుశిబిరమునుండి వెడలిపోయెను.

శాక్తసింహు డుదయపురమునకు బయలుదేరెను. పోవుచు కనబడినవారి నందరిని అతడు "మేవాడుకు సహా యులు కండు" అని ఆహ్వానించెను. ఈవిధముగా నతడు చిన్న సేనాదళమును సమకూర్చెను. ఆదళముతో నతడు భాయిన్‌స్రోర్ దుర్గమును స్వాధీనపరుచుకొనెను. అచట నున్న మొగలుసైన్యము నంతయు హతము చేసెను. తరు వాత నతడు తన సైన్యములో కొంతభాగము నచట నుంచి మిగిలిన భాగముతో ప్రతాపుని కడకు పోయి చేతులు కట్టు కొని నిలుచుండెను.

ప్రతాపసింహుడు శాక్తసింహుని సాదరముగా నాలింగనము చేసుకొని ఇట్లు పలికెను: "రమ్ము, తమ్ముడా! నీవు నాయింటి బిడ్డవు. లోనికి రమ్ము. ఎందులకు సందే హించెదవు? నాదు పవిత్రమైన చైతకశవముకడ నిన్ను

సోదరునిగా గ్రహించితిని — కేవలము నా ప్రాణములు రక్షించితి వని కాదు సుమా — నీ హృదయము పశ్చాత్తాపముతో తపించిన దనియు మన జన్మభూమి యగు మేవాడు కోసము పరితపించిన దనియు నిన్ను నేను సోదరునిగా పరిగ్రహించితిని. రమ్ము, తమ్ముడా! నీవు మేవాడరాజపుత్రుడవు! నీవు నా దక్షిణహస్తమవు! రమ్ము!"

శాక్తసింహుడు ప్రతాపుని పాదములకు నమస్కరించి ఇట్లనెను: "నేను నీ దాసుడను. నీవు మేవాడకు రత్నాలంకారమవు! నీవు రాణావు. నీ సన్మాన మపేక్షించి ప్రథమ దర్శనమున నజరాణాగా భాయిన్‌స్రోర్ దుర్గ విజయమును గొనివచ్చితిని. అన్నా, పరిగ్రహింపుము".

అంత ప్రతాపు డిట్లనెను: "నేను నజరాణా గ్రహించితిని. కాని నేను నా తమ్ముని గూడ బహుమానింప వలసియున్నది. నీవు జయించిన భాయిన్‌స్రోర్ దుర్గమును దానికి సంబంధించిన జమీనులను నీకే యొసగుచున్నాను. నేటి నుండి నేనే నీవై ఆ దుర్గమును రక్షింపుము. విలంబము చేసిన విపత్తులు కలుగ వచ్చును. కనుక నేడే బయలుదేరి పొమ్ము,".

ఆ నాడే శాక్తసింహుడాలసింపక జ్యేష్ఠసోదరుని ఆజ్ఞానుసారము భాయిన్‌స్రోర్ దుర్గమునకు బయలుదేరెను.

## ౧౫

హాల్దీఘట్ట యుద్ధానంతరము వెంటనే మొగలులతో యుద్ధము తటస్థింపలేదు. వర్షాకాలము కూడ వచ్చినది. ఎండిపోయిన కొండవాగులును నదులును జలపూర్ణము లైనవి. నిరంతరముగా వర్షములు కురియు నారంభించినవి. నడుమ నడుమ జలగలు పురుగులు మొదలైనవి చెలరేగినవి. మొగలుసైన్య మిక మేవాడులోని పర్వత ప్రదేశములందును అరణ్యప్రదేశములందును ముందుకు సాగి పోలేక పోయినది. మొగలులు క్రమక్రమముగా వెనుకకు తిరిగిపో నారంభించిరి.

ప్రతాపునకు సైన్యసంగ్రహము చేయుటకును యుద్ధ పరికరములు కూర్చుకొనుటకును కావలసినంత వ్యవధి దొరకి నది. హాల్దీఘట్టమునుండి తిరిగి వచ్చిన యెనిమిదివేలమంది సైనికులును మరల నొక్కచోట కూడుకొనిరి. భిల్లసైన్యము ఒకవేయిమంది కలరు. నూతనముగా సంగ్రహించిన సైని కులు ఇంకొక వేయిమంది యుండిరి.

వర్షాకాలము గతించినంతనే మొగలులు ముందుకు రాసాగిరి. ప్రతాపుడును యుద్ధమునకు సిద్ధముగా నుండెను. అతడా పదివేల సైనికులతో బోయి మరల హాల్దీఘట్టము వద్ద మొగలులతో యుద్ధమునకు తలపడెను. కాని విస్తారమైన మొగలువాహినితో ఆ స్వల్పసైన్య మెంతకాలము పోరాడ గలదు ? రాజపుత్రసైన్యము ఛిన్నభిన్నమైపోయినది. పర్వత

ప్రదేశములందు మొగలులతో యుద్ధము అసంభవమైనది. మిగిలిపోయిన కొలది సైన్యమును ప్రతాపుడు చిన్న చిన్న భాగములుగా విభజించి ఉదయపురము కోమలమీరు గోగుండ మొదలగు పర్వతదుర్గములకు పంపి, తాను కోమ మీరునం దుండెను.

మొగలుసైన్యము కూడ విభాగములుగా విభక్తమై ఒక్కొక్కటి ఒక్కొక్క దుర్గము నాక్రమింప దొడగెను. ప్రతాపుని తమ్ముని కుమారుడును సాగరజీపుత్రుడును నగు మహాబత్ ఖాను మొగలుసైన్యముతో పోయి తన పితామహుని నూతనరాజధాని యగు ఉదయపురమును స్వాధీన పరుచు కొనెను. సాహాబాజఖాను కోమలమీరు నాక్రమించెను. చాల దినములు యుద్ధము జరిగినది. ప్రతాపుడు అత్యల్పరాజపుత్ర సైన్యముతో దుర్గమును రక్షింపసాగెను. సాహాబాజఖాను హతాశుడై తిరిగిపోవుటకు సన్నాహము చేయుచుండెను. అట్టి సమయమున ఆ బూదుర్గపు సర్దారు మొగలుల ప్రలోభమునకు వశుడై వారితో కలిసెను. అతడు వారి కిట్లు ఉపాయము చెప్పెను: "ఇది గ్రీష్మ సమయ మగుటచే కోమలమీరునందలి జలాశయము లెండి పోయినవి. ఒక్క కూయానది మాత్రమే కోమమీరువాసులకు జీవనాధారము. అది జీవనదివలె ఎండిపోక పర్వతాంచలముల కానుకొని సన్నగా ప్రవహించుచుండును. కావున నేదో యుపాయ మాలోచించి ఆజలము దూషితము చేయు

గలిగినచో జలాభావముచే రాజపుత్రులాత్మసమర్పణమైన చేయుదురు. లేదా మృత్యుముఖమైనను ప్రవేశింతురు."

ఆయుక్తి నంగీకరించి కూయా నదీ జలము దూషితము చేయుటకై సేనాపతి గుప్తచారుని పంపెను. వాడు రహస్యముగా బోయి ఆజలములందు విషము గలిపి వచ్చెను. రెండు మూడు దినములలో ఆ నదియందలి జలజంతువులన్నియు చచ్చి పైకి తేలినవి. జలము పానయోగ్యము కాకుండ పోయినది. ఆగ్రీష్మమున నతి శీఘ్రకాలములో కూయానదికి క్రొత్తనీరు వచ్చుట అసంభవము. కొమలమీరు నివాసులా మండుటెండలలో పిపాసార్తులై బాధపడుచుండ ప్రతాపుడు ఎంతో కష్టపడి వారి నందరి నొక్కచోటికి జేర్చెను. పురుషులు తమ వస్తువులను నెత్తిన బెట్టుకొనిరి స్త్రీలు తమ సంతానము నెత్తుకొనిరి. వారందరును గలిసి కొమలమీరునుండి దుర్గమమగు పర్వతమార్గమున పలాయితులైరి.

ప్రతాపుడు కొండల నడుమ ప్రయాణించుచు నందలియరణ్యములలోని భిల్లుల నివాసముల కరిగెను. అచట 'ఘేరా చౌంద' అను ప్రదేశమున విడిసెను. దానికి నలువైపులను సాంద్రారణ్యములును ఉన్నతపర్వతములును గలవు. ప్రతాపు డెక్కువ రోజులు విశ్రాంతి నొందుటకు వీలు కలుగలేదు. అచట కూడ మొగలులతని జాడ కనిపెట్టిరి. ఫరీద్ ఖాను చౌంద నాక్రమించెను. ఇంకొక సేనాపతి అచటి

వారి ఆహారసామగ్రు లపహరించి వారు పోవు మార్గములకు నిప్పంటించెను.

ఈ సారి మేవా డంతయు మొగలుల వశమైనది. మేవాడు దాటి పోవుట యటుంచి ప్రతాపు డా పర్వతము లందు గూడ నిరాపదగా సంచరింప లేకుండెను. మొగలు లా పర్వతమార్గముల నాక్రమించియుండిరి. ఇక ప్రతాపు డేమి చేయ గలడు ? అత డొక యరణ్యమునుండి యింకొక యరణ్యమునకును, ఒక గుహనుండి యింకొక గుహకును తిర గుచు ఎట్లో దాగికొనుచుండెను. ఇట్టి కష్టములకును అవ మానములకును లోనైనను అతని మనస్సులో నిరాశ జనింప లేదు.

ప్రతాపు డప్పటికిని తన కుటుంబముతో పాటు కొలదిమంది విశ్వాస్యులను దగ్గర నుంచికొనెను. తన సైన్య మును చిన్న చిన్న దళములుగా విభజించి అచ్చటచ్చట నిలిపి యుంచెను. కాని యెక్కువ దూరము పోవుటకు వీలు లేకుండెను. నేడు గుహలోను రేపు అడవిలోను ఎల్లుండి మరియొక చోటను తానును తన పరివారమును మిత్రవర్గ మును దాగుకొనుచుండిరి. మొగలులు తమ జాడ కనుగొందు రేమో అని పగ లంతయు ఒక్కచోట నుండక ప్రయా ణించుచుండిరి. ఇంత శరీరక్లేశమును ఇంత మనోవ్యధయు కలిగినను ప్రతాపు డెల్లప్పుడును జాగరూకతతో నుండెను. శత్రువులు సమీపించి నప్పుడు వారి సైన్య మెక్కుడుగా

నుండినచో తప్పుకొని పోవుచు తక్కువగా నున్నపుడు తన సైనికుల నొకచోటికి చేర్చి శత్రువులమీాద బడి వారిని సంహరించుచు మరల తన రహస్యస్థానమునకు పోవుచుండెను.

## ౧౬

ఆ సమయమున శాక్తసింహుడు భాయిన్‌స్రోర్ దుర్గమున నుండెను. దుర్గమును శత్రువులు ముట్టడించి ఉండుటచే అతడు ప్రతాపున కెట్టి సహాయమును చేయలేకపోయెను. అత డనేకపర్యాయములు దుర్గము బయటికి వచ్చెను. కాని వచ్చినపు డెల్ల శత్రువు లతని మార్గము నిరోధించుచుండుటచే తిరిగి దుర్గములోనికి పోవలసివచ్చుచుండెను. అందుచేత నతడు నిరాశ్రయు డగు ప్రతాపున కెట్టి సహాయమును చేయలేకపోతిని గదా అని మర్మచ్ఛేదక మగు బాధ ననుభవించుచుండెను. అయినను అత డెక్కువ దినము లట్లు యాతన పడవలసిన అవసరము లేకపోయెను. కొలది దినములు యుద్ధము చేసి చేసి శాక్తసింహుడు స్వర్గస్థు డయ్యెను.

ప్రతాపుడు తన బాధ లట్లుండ భ్రాతృశోకము గూడ పొందవలసినవా డయ్యెను. శాక్తుడు మొగలువినాశనమునకై శరీర మర్పించినాడు. మిగిలిన పర్వతదుర్గములు కూడ శత్రువశము లైనవి. ఇక మేవాడులో మిగిలిన దేదియు లేదు. రాజ్య మీావరకే గతించినది గదా! ఇపుడు మేవాడులోని

అరణ్యములందు నివసించుట కూడ ప్రతాపునకు కష్టమై పోయినది. అతని కష్టముల కవధి లేదు.

అయిదు సంవత్సరముల వరకు యుద్ధము జరుగుచునే యుండెను. ప్రతాపునకు వేళ కాహారము లేదు. కంటికి నిదుర లేదు. తగిన విశ్రాంతి లేదు. సుఖ శాంతు లెట్టివో అతడు మరచిపోయినాడు. ఇంత శ్రమమును ఇంత యాతనయు అనుభవించుచున్నను అతడు మొగలులకు మాత్రము తల యొగ్గలేదు.

మొగలులు కూడ వదలి పోలేదు. ప్రతాపుడు పట్టుబడ లేదు. కష్టము లెక్కువగుచున్నను అతని హృదయ ద్రఢిమ తరుగ లేదు. తన స్త్రీ పరివారము మొగలుల చేతులలో పడునేమో యని అతని ప్రధాన భయము. అందుల కతడు నలుదెసలకు చారుల నంపి వారి గమనవిధానము నెప్పటి కప్పు డరయుచుండెను.

ఒకనాడు ప్రతాపుడు పగలంతయు ప్రయాణించి ఆలుబిడ్డలతో సంతోషముగా ఒకానొక వృక్షతలము నాశ్రయించెను. తానును భార్యయు క్షుధానివృత్తికై భోజనపదార్థములు తయారు చేసికొనుచుండిరి. బిడ్డలు నేలమీద పండుకొని నిదురించుచుండిరి. అట్టి సమయమున శత్రువులు వచ్చుచున్నారను వార్త వచ్చెను. అప్పు డతడు పగటి శ్రమము పాటించక ఆకలితోను దప్పితోను బాధపడుచు కుటుంబమును వెంట నిడుకొని అచ్చోటు వాసి అత్యంతసహిష్ణు

తతో దుర్గమము లగు పర్వతమార్గములు బట్టి పోవసాగెను. త్రోవలో తన మాట యటుండ భార్యకును బిడ్డలకును ముండ్లు గ్రుచ్చుకొనుచుండెను. వారి శరీర మంతయు చీరుకొని పోవుచుండెను. అప్పుడైనను ప్రతాపుడు తన ప్రతిజ్ఞ సడలించి మొగలులకు స్వాతంత్ర్యము విక్రయించినాడా? అతని కట్టి తలంపు గూడ కలుగలేదు. ఇట్టి యుద్ధము—ఇది యుద్ధమన దగిన యెడల—మానవునకు సంభవ మగునా? ఇది బాహాబాహీ ఖడ్గయుద్ధము కాదు. ఇది మనోబలముతోడి యుద్ధము, దుర్భిక్షముతోడి యుద్ధము, ప్రకృతితోడి యుద్ధము!

> శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
> స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

అను భగవద్వాక్యము సర్వదా ప్రతాపుని హృదయమున మెరగుచుండెను.

## ౧౭

క్రమముగా నీ వార్త లన్నియు ఢిల్లీ సింహాసనమునకు చేరినవి. అక్బరు స్వయముగా ప్రతాపుని ప్రశంసించుచు నిట్లుపలికెను: "ప్రతాపుని వంటి మహావీరుని కనుటచే రాజపుత్రస్థానము ధన్యమైనది! అట్టి మహానుభావుడు శత్రువుగా నుండుటచే నేను కూడ ధన్యుడను! ప్రపంచములో నత

డొక్కడే పురుషపుంగవు డని చెప్ప దగినవాడు. అట్టి రాజర్షి సత్తముని మైత్రి నాకు లభించునేని ఒక్క మేవాడునే కాదు సమస్తరాజపుత్రస్థానమును అతనికి హృదయపూర్వకముగా నొసగగలను !"

మొగలుదర్బారులో బికనీరు రా జగు రాజసింహుడును అతని కుమారు డగు పృథ్వీరాజును గలరు. పృథ్వీరాజునకు యుద్ధవిద్య తెలియదు. కాని అతని ప్రాణములలో రాజపుత్ర తేజము వెలుగుచున్నది. అతడు ప్రతాపసింహు డన్న భక్తిశ్రద్ధలు కలవాడు. లోలోపల అతనిని పూజించుచుండువాడు. ప్రతాపుని స్వదేశవాత్సల్యమును స్వాతంత్ర్య దీక్షయు పృథ్వీరాజు హృదయమునకు మహానందము కలిగించినవి. అతడు కవి. అతని కవిత్వ మన్న అక్బరుకు చాల ప్రీతి. పృథ్వీరాజు స్వతంత్రవ్యక్తి. యుక్తమైనది పలుకుట కెవ్వడును భయపడడు. పాదుషా భయమున తన యభిప్రాయములను సంకోచించుకొనడు. అయినను అక్బరు పృథ్వీరాజు నెడ విరక్తుడు గాక పైపెచ్చు సంతోషించుచుండువాడు పృథ్వీరాజు దర్బారులో ప్రతాపుని గుణములు కీర్తించు నప్పుడు అనేకుల సమ్మతిని ప్రకటించుచుండిరి. అక్బరు మాత్రము దానిని తిరస్కరించుచుండెను. పృథ్వీరాజు నేమియు ననువాడు కాదు. పృథ్వీరాజు ప్రతాపుని యశోగీతము లనేకములు రచించి సర్వసమక్షమున పఠించుటయే కాక పాదుషాతో నిట్లు పలికెడివాడు: "తమ రెంత కష్ట పెట్టినను ఎన్ని దుష్కార్యము లొనర్చినను ఎంత సైన్యమును

పంపినను ప్రాణములతో ప్రతాపసింహుడు తమకు లభింపడు. గొంతులో ప్రాణము లున్నంత వరకు మొగలులకు తల వంచడు." అయినను అక్బరు నిరాశుడు కాలేదు.

## ౧౮

వత్సరములకు వత్సరములు గడచినవి. క్రమముగా ప్రతాపుని కష్టములు గూడ వృద్ధి నొందినవి. అతని పరివారములో నిపుడు సగము గూడ లేదు. నివసించుట కతనికి బహుకాలము నుండియు కుటీరము కూడ లేదు. ఒకప్పుడు చెట్లక్రిందను, ఇంకొకప్పుడు పర్వత గుహాలందును ప్రతాపుడు సపరివారముగా కాలము గడపు చుండెను. ఒకప్పుడు అవికూడ లభించెడివి కావు. క్రమముగా గ్రీష్మము గతించి వర్షాకాలము వచ్చినది. అపుడు ప్రతాపుడు పడిన కష్టములు చెప్ప నలవికాదు. ఈరీతి నతడెట్లో దినములు పుచ్చుచుండెను.

ఇప్పు డింకొక క్రొత్త విపత్తు తటస్థించినది. ధనమైపోయినది. ఆహారపదార్థము లైపోయినవి. ఇక ఉపాయమేమి? ప్రతాపు డప్పుడును చలింపలేదు. అతడు గడ్డి దుంపలు త్రవ్వి వానితో రొట్టెలు తయారుచేయు మని రాణితో చెప్పెను. క్రమముగా నా దుంపలు గూడ దొరకని రోజులు వచ్చినవి. వారందరును ఒక రోజు రెండు పూటలు

డొక్కడే పురుషపుంగవు డని చెప్ప దగినవాడు. అట్టి రాజర్షి సత్తముని మైత్రి నాకు లభించునేని ఒక్క మేవాడునే కాదు సమస్తరాజపుత్రస్థానమును అతనికి హృదయపూర్వకముగా నొసగగలను !"

మొగలుదర్బారులో బికనీరు రా జగు రాజసింహుడును అతని కుమారు డగు పృథ్వీరాజును గలరు. పృథ్వీరాజునకు యుద్ధవిద్య తెలియదు. కాని అతని ప్రాణములలో రాజపుత్ర తేజము వెలుగుచున్నది. అతడు ప్రతాపసింహు డన్న భక్తిశ్రద్ధలు కలవాడు. లోలోపల అతనిని పూజించుచుండువాడు. ప్రతాపుని స్వదేశవాత్సల్యమును స్వాతంత్ర్య దీక్షయు పృథ్వీరాజు హృదయమునకు మహానందము కలిగించినవి. అతడు కవి. అతని కవిత్వ మన్న అక్బరుకు చాల ప్రీతి. పృథ్వీరాజు స్వతంత్రవ్యక్తి. యుక్తమైనది పలుకుట కెప్పుడును భయపడడు. పాదుషా భయమున తన యభిప్రాయములను సంకోచించుకొనడు. అయినను అక్బరు పృథ్వీరాజు నెడ విరక్తుడు గాక పై పెచ్చు సంతోషించుచుండువాడు పృథ్వీరాజు దర్బారులో ప్రతాపుని గుణములు కీర్తించునప్పుడు అనేకుల సమ్మతిని ప్రకటించుచుండిరి. అక్బరు మాత్రము దానిని తిరస్కరించుచుండెను. పృథ్వీరాజు నేమియు ననువాడు కాదు. పృథ్వీరాజు ప్రతాపుని యశోగీతము లనేకములు రచించి సర్వసమక్షమున పఠించుటయే కాక పాదుషాతో నిట్లు పలికెడివాడు: "తమ రెంత కష్ట పెట్టినను ఎన్ని దుష్కార్యము లొనర్చినను ఎంత సైన్యమును

పంపినను ప్రాణములతో ప్రతాపసింహుడు తమకు లభిం పడు. గొంతులో ప్రాణము లున్నంత వరకు మొగలులకు తల వంచడు." అయినను అక్బరు నిరాశుడు కాలేదు.

## ౧౮

వత్సరములకు వత్సరములు గడచినవి. క్రమముగా ప్రతాపుని కష్టములు గూడ వృద్ధి నొందినవి. అతని పరివార ములో నిపుడు సగము గూడ లేదు. నివసించుట కతనికి బహుకాలము నుండియు కుటీరము కూడ లేదు. ఒకప్పుడు చెట్లక్రిందను, ఇంకొకప్పుడు పర్వత గుహాలందును ప్రతాపుడు సపరివారముగా కాలము గడపు చుండెను. ఒకప్పుడు అవికూడ లభించెడివి కావు. క్రమముగా గ్రీష్మము గతించి వర్షాకాలము వచ్చినది. అపుడు ప్రతాపుడు పడిన కష్టములు చెప్ప నలవికాదు. ఈరీతి నతడెట్లో దినములు పుచ్చు చుండెను.

ఇప్పు డింకొక క్రొత్త విపత్తు తటస్థించినది. ధనమై పోయినది. ఆహారపదార్థము లైపోయినవి. ఇక ఉపాయ మేమి? ప్రతాపు డప్పుడును చలింపలేదు. అతడు గడ్డి దుంపలు త్రవ్వి వానితో రొట్టెలు తయారుచేయు మని రాణితో చెప్పెను. క్రమముగా నా దుంపలు గూడ దొరకని రోజులు వచ్చినవి. వారందరును ఒక రోజు రెండు పూటలు

తినెడివారు. ఇంకొకరోజు ఒకపూటే భుజించువారు. మరి యొకరోజు ఏమియు లేక పస్తుండెడివారు.

"అక్బరుపాదుషా! నేను మీయధీనుడను" అని ఒక్కమాట పలికినచో కష్టములన్నియు తీరిపోవు నని ప్రతాపు డెరుగును. అంతేకాక ఒక్క ముహూర్తములో మేవాడంతయు ప్రాప్తించును. ఇంకను మొగలు దర్బారులో ఉన్నతాసనము గూడ లభించును. కాని ప్రతాపు డామాట అనలేక పోయెను. అయితే ఒక నాటి సంఘటనము వలన అతని దృఢప్రతిజ్ఞయు కఠినహృదయమును చలించినవి.

ఒకనా డొక గుహాలో విడిసి ప్రతాపుడు గడ్డిదుంపలు త్రవ్వి తీసికొని వచ్చెను. వానితో కొలది రొట్టెలు మాత్రమే తయారైనవి. అందుచే నందరు నా దిన మొక్క పూటే భుజించిరి. ప్రతాపుని కూతురు చిన్నపిల్ల. ఆమెకు తలిదండ్రుల కష్టములు తెలిసికొను నంత తెలివి లేదు. ఆ బిడ్డ, "అమ్మా! ఇంకను ఆకలి తీరలేదే! సాయంకాలము తినుటకు కొంచెము రొట్టె ఉంచితివా?" అన్నది. ఆ మాటలకు రాణికి కనుల నీరు గిర్రున తిరిగినది.

ఆమె తాను తినక తన రొట్టె బిడ్డకోస మట్టె యుంచినది. కుమారి పలుకులకు ప్రతాపుని ప్రాణములు చివుక్కురు మన్నవి. అభము శుభము తెలియని పసిబిడ్డ! ఆమెకు తెలియ జెప్పుట యెట్లు? ప్రతాపుడు తన దుర్దశను గూర్చి

విచారింప దొడగెను. భర్తృముఖము చిన్నవోవుట చూచి రాణి యతనికి ఉత్సాహము కలిగింప యత్నించుచుండెను.

ఆ సమయము కనిపెట్టి అడవిపిల్లి తటాలున వచ్చి దాచి పెట్టిన రొట్టె నోట గరచుకొని పారిపోయెను. చిన్న బిడ్డ ఆ రొట్టె వంక జూచుచు సాయంకాలము కాగానే దానిని తినవచ్చు నని ఉవ్విళ్లూరు చుండెను. పిల్లి యా రొట్టె నెత్తుకొనిపోవుట చూచి బిడ్డ కెవ్వున కేక పెట్టి ఏడువ దొడగెను. ప్రతాపునకు మర్మాంతకమైన వ్యధ కలిగెను. అత డిక స్థిరముగా నుండలేక రాణి వంక జూచెను. రాణియు కన్నీరు కార్చుచుండెను.

అపుడు ప్రతాపు డిట్లనెను : "నా జన్మము వ్యర్థము! నా స్వాతంత్ర్యదీక్ష వ్యర్థము! నా కులజాతి గౌరవము వ్యర్థము! నా కుటుంబమును నా పరివారమును నిత్య మొక్క రొట్టెముక్కకు గూడ నోచుకొన నప్పుడు నా రాజత్వము శోభింపదు. స్వాతంత్ర్యము వదలుకొనినచో నావారి కందరికిని కడుపునిండ భోజనము లభించు నెడల నేను మొగలులకు లోబడెదను."

తనవారి దుఃఖదైన్యములు తొలగించుటకై మొగలులకు లోబడ నిశ్చయించుకొని ప్రతాపుడు లేఖ వ్రాసి భిల్ల సైనికుని చేతి కిచ్చి పాదుషాకు పంపెను. దాని తాత్పర్య మిది : "నేను భార్యా పుత్రుల కష్టములు సహింప లేకున్నాను. భిక్షుకునకు రాజాభిమానము శోభింపదు. తమరు

దయ యుంచి నా కుటుంబ పరివారముల దుఃఖ దైన్యములు తొలగింప వలయును."

౧౮

ఆలేఖ నందుకొని అక్బరు పరమాహ్లాదము నొందెను. నేటి కతని మనోరథము సిద్ధించినది. వెంటనే అతడు రాజధానియం దుత్సవములు నలుపుట కాజ్ఞ యిచ్చెను. పట్టణమంతయు దీపమాలికలతోను పుష్పవస్త్రాది తోరణములతోను పతాకలతోను అలంకృత మయ్యెను. ఒకచోట నృత్యములు, ఒకచోట గానములు, ఒకచోట విందులు! ఎటు చూచినను మహోల్లాసము తాండవించు చుండెను. అట్టి యుత్సవ మా రాజధానిలో నదివర కెన్నడును జరిగి యుండ లేదు. అక్బరు ప్రతాపునకు దర్బారులో సర్వోన్నత పదవి నొసగ నిశ్చయించుకొనెను.

పృథ్వీరాజు ఆ వృత్తాంతము నమ్మలేదు. అతడు కొన్నిదినములు మనసులో సహింపరాని బాధ ననుభవించి, చివర కొకనాడు సమ్రాట్టును సమీపించి "పాదుషా! ప్రతాపుని లేఖ మీద నాకు విశ్వాసము లేదు. తమరు కొలది దినములు గడు వొసంగినయెడల నే నాయనకు పత్రము వ్రాసి యతడు సత్యముగా లేఖ వ్రాసెనో లేదో తెలిసికొనెదను. అందు కనుజ్ఞ దయచేయుడు" అని సకరుణముగా ప్రార్థించెను. పృథ్వీరాజు ప్రియపాత్ర మగుటచే అక్బరు అందుల కంగీకరించెను.

అపుడు పృథ్వీరాజు ఉత్తేజన వ్యంజకమగు భావతో ప్రతాపునకు లేఖ వ్రాసి పంపెను. దాని తాత్పర్య మిది :

"రాణాజీ! హిందువుల కన్నియు పోయినవి. చిట్టచివరకు వారి యాశ లన్నియు తమ మీదనే నెలకొని యున్నవి. తమరు కష్ట నిష్ఠురములు పడి యైనను దుఃఖ దైన్యములు అనుభవించియైనను రాణాకుల గౌరవమును రాజపుత్ర జాతి గౌరవమును మేవాడు రాజ్య గౌరవమును నిలుపక పోయినచో ఇంక నెవరు నిలుపగలరు ? హిందువుల పేరు భారత దేశములో లోపించి పోవుచున్నది. ఇక రాజపుత్రస్థానము దశ ఎట్లుండునో చెప్ప లేను.

"తమ రొక్కరే నేటికిని తల యెత్తుకొని యున్నారు. తల వంచుట కొక ముహూర్తము కూడ పట్టదు. కాని ఒక్కసారి తల వంచిన మరల తల యెత్తుట సంభవింపదు. తమకు రాజ్యము లేదు, ఆశ్రయము లేదు, బలము లేదు! సత్యమే! కాని తమకు అన్నిటి కన్న మిన్నయగు మనుష్యత్వ మున్నది! తమరు కర్మవీరులు! తమవంటి రాజర్షుల వలననే హిందువుల యౌన్నత్యము నేటికిని నిలిచి యున్నది!

"తమరు హతాశులు కావలదు. దైవాంశతో తేజరిల్లు తమ శౌర్యసాహసములకు సర్వేశ్వరుడు తగిన సత్కారమనుగ్రహించును! హిందువులకు తమరే శరణము. తమరే హిందువుల గౌరవము కాపాడవలయును. భగవంతుడు తమ్ము అతికఠినముగా పరీక్షించినాడు. ఇపుడు తమ రా పరీక్షయం

దు_త్తీర్ణు లగుచున్నారు. చిట్టచివరి ముహూర్తమున నిరాశ నొంద నేల ?"

శుభముహూర్తమున అగ్నివర్తి యగు పృథ్వీరాజు లేఖ ప్రతాపున కందినది. దిల్లీయం దుండియు పృథ్వీరాజు అంత దేశభక్తితో అంత రాజతేజముతో నుండుట చూచి అతడు విస్మితు డయ్యెను. ఒక్క దుర్ముహూర్తమున కలిగిన మనోదౌర్బల్యముచే నత డట్టి లేఖ వ్రాసియుండెను. అందు కివు డతని హృదయము దహించుకొని పోవుచుండెను. ఏదో చంటిబిడ్డ క్షణకాల మేడ్చిన దని అంత కష్టపడి అన్ని దుఃఖదైన్యము లనుభవించి ప్రాణములకన్న నెక్కుడుగా రక్షించుకొన్న స్వాతంత్ర్యమును నే డతడు నేలపాలు జేయ సిద్ధపడినాడు. పృథ్వీరాజు లేఖ జదివినంతనే అతని పూర్వ తేజము ప్రస్ఫుటించినది. మొగలులపై విద్వేషము సంపూర్ణాకారముతో ప్రకాశించినది.

ప్రతాపుని లేఖ వలన అక్బరు కెంత ఆహ్లాదము కలిగెనో మొగలు సేనాపతులకు గూడ నంతగా శరీరములు పులకరించినవి. ఆ సమయమున సాహాబాజఖాను దేపీదుర్గ మున నివాస మేర్పరుచుకొని యుండెను. అచటి మొగలు సైనికులు నేడు ఆమోదప్రమోదములతో దుర్గద్వారముకడ పహరా వేయుట మాని వినోదింప దొడగిరి. "ప్రతాప సింహుని గర్వము కరగినది. అతడు మొగలుల ప్రతాపము నకు లొంగినాడు" అని ఉల్లాసపడుచుండిరి.

## ౨౦

ప్రతాపుడు దుర్భిక్షముతోను దారిద్ర్యముతోను బాధలు పడలేక మేవాడుపర్వతములు పరిత్యజింప స్థిరపరుచుకొనెను. ధనము లేదు, బలగము లేదు ఇక నచట నుండిన మొగలులకు బంది కావలసివచ్చును. అయినను ప్రియమైన మేవాడును — మాతృభూమి యగు మేవాడును — వదలి పోవలయు ననిన నతని హృదయము తరుగుకొని పోసాగెను.

'జన్మభూమి యగు మేవాడు నందలి జలము ఇక ప్రతాపునకు లభింపదు. ఆ కొండలయందును ఆ యరణ్యము లందును ప్రకుమ్మరుచు నిశ్శంకముగా మొగలు సైన్యము మీాద బడుట కవకాశ ముండదు. ప్రహదతీరమందలి స్వచ్ఛ వాయువును సేవించు నదృష్టము ఘటిల్లదు. అన్నటి కన్నను "నా మేవాడు" అని నోరార పలుకుటకు గూడ వీ లుండదు.

ఇంత కాలము గిరిగహ్వరములందును అరణ్యము లందును సంచరించుచు సహింపరాని క్లేశము లనుభవించు చున్నను 'మేవాడులో నుండి మేవాడు నుద్ధరించుట కిట్టి కష్టములు పడుచున్నాను' అనెడి భావము ప్రతాపునకు మన శ్శాంతి కలిగించుచుండెను. అతని ప్రాణములలో ఆశ లుద యించుచుండెను. కాని ఇపుడు జన్మాంతము వరకు శాంతి సుఖదాయిని యగు జన్మభూమిని వదలి పోవలసి వచ్చెనే యనెడి దుఃఖము దుస్సహ మయ్యెను. ఏ ధీరుని దృఢప్రతిజ్ఞ

రాజధానీసముద్ధరణమో, ఏ కర్తవ్యపరాయణుని మూలమంత్రము "మనోరథసిద్ధి లేదా శరీరపతనము" అనునదియో ఏ పురుషసింహుడు సింహాసనము రక్షించుటకై నాలుగు సంవత్సరములు మొగలులతో వరుసగా యుద్ధములు సలిపెనో, ఏ రాజర్షిసత్తముడు భయంకర పర్వతారణ్య భూములందు తిరుగుచు ఎన్నియో కష్టములు ఎన్నియో విపత్తులు అవలీలగా నతిక్రమించి అమానుషవీరత్వమును ప్రదర్శించెనో, ఏ దేశభక్తునకు స్వదేశ స్వాతంత్ర్యములు జపతపములయ్యెనో అట్టి ప్రతాపుడు భయంకర దుర్భిక్ష బాధచేతను ధనాభావమువలన సైనికబల సంగ్రహము చేయలేకను దేశము త్యజించి పోవుచున్నాడు! ఇంతకన్న మహాసంక్షోభకరమైనది ఇంకేమి యుండగలదు!

రాజపుత్రస్థాన మింత అధఃపతన మొందినదా? అచటి ప్రజ లింత నిర్వీర్యులైనారా? ఆ వీరపురుషుని ఘనత తెలిసికొన లేకుండిరా? ఆ స్వార్థత్యాగికి - ఆ కర్మవీరునకు ధనసహాయము చేయ లేకపోయినారా? ప్రతాపుడు కేవలము స్వదేశోద్ధరణముకోసము తన సర్వస్వమును పోగొట్టుకొని చిట్టచివరకు పొట్టకూటికై - రెండు కబళముల కోసము దేశత్యాగి కావలసివచ్చెనా? పరమేశ్వరుడు కూడ కఠినుడయ్యెనా? లేదు, లేదు!

శుభసమయము సమీపించినది. మేవాడుకు కలిగిన ఘోరవిపద్దశను గూర్చి మేవాడుభక్తుడగు ప్రతాపసింహుడు చేసిన సకరుణార్తనాదమును ఏకలింగస్వామి

హృదయము ద్రవించినది. మేవాడుదుఃఖదైన్యములు తొల గించుటకై పరమేశ్వరు డా సమయమున మేవాడుమంత్రి యగు భామసాను ప్రతాపుని సన్నిధికి పంపినాడు.

భామసా గుప్తచారులవలన ప్రతాపుని ఆశ్రయ స్థానము తెలిసికొని అతనిని దర్శింపవచ్చెను. ఇతడే మేవాడు రాజమంత్రి. ఇతని వంశీయులు పరంపరానుగతముగా మేవాడు రాణాలకు మంత్రులుగా నుండిరి. వీరికి మాసిక వేతన మనునది ఏదియు లేదు మేవాడు రాణాలు సంగ్ర హించిన రాజస్వములో ఒకానొక నిర్దిష్టాంశము వీరికి లభించుచుండెను.

భామసా పూర్వపురుషులందరు తమ రాజస్వాంశము లను వ్యయింపక కూడబెట్టుచుండిరి. భామసా అతివిచక్షణు డగుటచేత పూర్వసంచిత ధనరత్నములనుండి ఏమాత్ర మును వ్యయింపక ఇంకను ధనరత్నములు కూడబెట్టెను. ఈ విధముగా కూడబెట్టిన ధనరత్నములు ఇప్పు డతని యొద్ద విశేషముగా నిలువ యున్నవి.

ఇంత కాలమునుండియు మొగలులతో యుద్ధములు జరుగుచుండుటచేత వారి దుష్కార్యములకు భయపడి భామసా ఈ ధనము తీసికొని ప్రతాపుని కడకు పోలేకపోయెను. ప్రతాపుడు పాదుషాకు వ్రాసిన లేఖవలన అపూర్వప్రయో జనము కలిగినది. అందువలన అల్పకాలములో దేశమందు శాంతి యేర్పడినది. ఇపుడు మొగలులు మేవాడు ప్రజల

యెడ దుష్కార్యము లొనర్చుట లేదు. పూర్వము దోపిడుల భయముచే మేవాడువాసులు సామాన్యముగా దూరదేశములకు ప్రయాణము చేయుటకు సాహసింప లేకుండిరి. ఇపుడు క్రమక్రమముగా నిర్భయులై మేవాడుసీమ నతిక్రమించి పోవుచు వచ్చుచుండిరి.

అక్బరుపాదుషా "నేడు ప్రతాపుడు దిల్లీకి వచ్చి ఆత్మ సమర్పణము చేయును" అని ప్రతిదినమును నిరీక్షించుచుండెను. సేనాధిపతులు పూర్వమే తమ అభినివేశములను సడలించిరి. వారు పాదుషావారి అనుజ్ఞ వడసి నృత్యగీతములందును సురాపానము లందును విందుల యందును మునిగి తేలుచుండిరి. "ప్రతాపసింహుడు నేటికి దిల్లీకి వచ్చి ప్రధాన దళాధిపతి కాబోవుచున్నాడు" అని భావించుచుండిరి. ఆ కారణమున మేవాడులో ప్రయాణించుట కెవ్వరికిని ఇపుడు మొగలుల భయము లేకుండెను.

ఇట్టి మంచి తరుణము వ్యర్థము చేయుట మంచిది కాదని యెంచి భామసా తన పూర్వులార్జించిన ధనసంచయము నంతయు వెంట నిడుకొని ప్రతాపుని సన్నిధికి వచ్చెను.

## ౨౧

భామసా ప్రతాపుని యెదుట నిలుచుండెను. ప్రతాపునకు అతనియెడ దృష్టి లేదు. అతని కనుబొమలు ముడివడి

యుండెను. అతని మనస్సు 'మేవాడులోని సుఖమయము లగు పర్వతోత్సంగములను శాంతిమయము లగు సుశీతలవృక్షచ్ఛాయలను వదలిపోవలసి వచ్చెను గదా' అని మర్మభేదకమగు యాతన ననుభవించుచుండెను. ఆ విచారముచే అతని సింహతేజ మెచటనో లీన మైనది. పృథ్వీరాజు లేఖవలన అతని ప్రాణముల కెట్టి ఉత్తేజనము కలిగెనో అది మాతృదేశపరిత్యాగ మను చింతచే ద్విగుణముగా అవసన్నమైనది.

భామసా వచ్చి ఎంతో సేపైనది. కాని ప్రతాపు డతని వంక చూడనే లేదు. అతడు నిర్వాక్కుగా నిష్పందుడుగా వజ్రాహతునివలె దారువిగ్రహమువలె కూర్చుండియుండెను. జన్మభూమిత్యాగము అను విచారము అతనిని గాఢముగా నావరించియుండెను. ఎవ్వరితోనైన పలుకుట కతనికి బాహ్యస్ఫురణ లేదు. అత డాహారము ముట్టుకొని మూడు దినములైనది.

హాల్దీఘట్టయుద్ధమున చైతక మెక్కి సలీము నాక్రమించినా డా ప్రతాపుడు, నేడీ ప్రతాపునకు ఆకాశపాతాలములు వ్యత్యస్తము లైనవి! అతని ప్రాణములందు స్పందము లేదు. మర్మవిచ్ఛేదక మగు యాతనచే నతని హృదయాంతరాలము విదీర్ణమైనది. భామసా చాలసేపు నిలుచుండి అంతయు నుపేక్షించి యిట్లు భావించెను: "ఇక నూరకుండుట యుక్తిసంగతము కాదు. ఏదో విధముగా మహారాణాను ఉద్బుద్ధుని చేయవలెను. లేకున్న అంతయు

నష్ట మగును. ఈ యవస్థయం దెక్కువ కాల మున్నచో నతడు నిశ్చయముగా ఉన్మత్తప్రాయుడు కాగలడు.”

భామసా ముందుకు వచ్చి నమస్కరించి యిట్లనెను: “మహారాణా! దాసుడు వచ్చినాడు. ఆజ్ఞాపింపుడు. దుష్టుడను, ఇంత కాలమునుండి తమ్ము కలిసికొనలేక పోయినాను. నా యపరాధము మన్నింపుడు!”

వృద్ధుని సకరుణ ప్రార్థనమునకు ప్రతాపు డించుక ఆకృష్టు డయ్యెను. అతడు చాల సేపు మౌనముగా నుండి ఇంచుక చిరునవ్వుతో నిట్లు పలికెను: “వృద్ధమంత్రీ! భామసా! సమయము కనిపెట్టి ‘రాణా’ యని మీరు గూడ నన్నపహసించుచున్నారా? పొండు, మీ త్రోవ మీరు చూచుకొనుడు. నా త్రోవ నేను చూచుకొనుచున్నాను. ఏ మేవాడు. వానులు స్వార్థపరులై సహానుభూతి శూన్యులైరో అట్టి మేవాడు అవశ్యము అధఃపతనము నొందవలసినదే! నే నిచట నుండి ఏమిచేయుదును? నా దృష్టి ఎటు పోవునో అటు పోవుదును. మొగలులు నన్ను పట్టుకొందురు గాక, చంపుదురు గాక! నాకు వృద్ధి క్షయముల భయము లేదు. మేవాడుకు కలిగిన ఈదశ నేను చూడలేను. రాణా శబ్దము విన్నంతనే నాకు గురు లఘుజ్ఞాన ముండదు. రాణా అట! ఎవరు రాణా? మొగలులు మేవాడును లాగికొన్నారు. ధన మొక్క దమ్మిడియు లేదు. బలగము లేదు. ఒక్కపూట కడుపు నింపుకొనుటకు భోజనము కూడ లేదు. ఇక నేనా

రాణాను! కనుక రాజపుత్రకుల కలంక మగు కాపురుషుడు ప్రతాపుడు జన్మభూమి యగు మేవాడు వదలి పోవలసిన దే!"

భామసా : తమ రెందుకు ఆ లాగున భావించు చున్నారు ? తమకు లేని దేమున్నది ? ధన మున్నచో పరి వారము సైనికులు అస్త్రములు – అన్నియు పొందవచ్చును.

ప్రతాపుడు : ఆధనమున కే ఇపుడు సంపూర్ణా భావము. భామసా! మీరు బుద్ధిమంతులు! మీ రీ మాత్రము గ్రహింప జాలరా ? ఇక వచ్చెడి దేమియు లేదు – అంతయు పోయినది. ఇక నేమియు తిరిగి రాదు. విధాత విముఖు డైనాడు !

భామసా: వృథాగా విధాత నేల నిందించెదరు ? నేను ధనవిషయమే చెప్పుచున్నాను. తమకు కావలసినంత ధన మున్నది. దానితో ముప్పదివేల సైన్యమును పది సంవత్సర ముల వరకు యథేష్టముగా పోషింపవచ్చును.

ప్రతాపుడు : మిథ్యావచనములు స్తోకవాక్యములు నాతో పలుకవలదు. నా కంత ధన మున్నదా ? అట్లయిన ఇంత కాలమునుండి నా కెందుకు చెప్ప లేదు? ఆ ధన మెచట నున్నది ? భామసా ! చెప్పుడు. శీఘ్రముగా చెప్పుడు. నా శరీ రము కంపించుచున్నది. శీఘ్రముగా చెప్పకున్న ధైర్యము చిక్కబట్ట లేకున్నాను. ఏదైన పాశవిక కార్యము చేయక మునుపు శీఘ్రము చెప్పుము !

భామసా : (శాంతముగా) మహారాణా ! స్థిరచిత్తులు కండు ! ఎందు కంత అధీను లయ్యెదరు ? తమవంటి సింహ హృదయులే విచలితులైనచో ఇక మావంటి వారి గతి యేమి ? తమరు సుస్థిర చిత్తులై వినుడు: ధనము నావద్ద సురక్షితముగా నున్నది. నా పితృపితామహాదు లందరు మేవాడు రాజస్వములో నొక యంశము పొందు చుండిరి. అది వా రెవ్వరును వెచ్చింపలేదు. దాని నొకచోట కూడబెట్టి యుంచిరి. ఆ ధన మిప్పుడు నిధితుల్య మైనది. మేవాడుసేవలో ప్రాప్తించిన ధనము నిపుడు మేవాడుకు సంభవించిన దుర్దశయందు సమర్పింపకున్న పరలోకమున మా యాత్మలకు సద్గతి కలుగదు. మహారాణా ! ఈ ధన రత్న సంచయము నంతయు పరిగ్రహింపుడు. ఇది యంతయు మేవాడుదే !

భామసా పలికిన పలుకులు విని ప్రతాపుడు విస్మయ ముతోను ఆనందముతోను పరవశు డయ్యెను. భామసా స్వార్థత్యాగమునకును స్వదేశానురాగమునకును విస్మయము. ఇక ఆనందమా, ఆశోదయము వలన ! ప్రతాపు డానందము నిట్లు వెల్లడించెను: "మరల నూతనసైన్య మేర్పడును, మరల మేవాడు నుద్ధరించుటకు రాజపుత్రు లస్త్రములు ధరింతురు, మరల ఆరవల్లీ పర్వతశ్రేణులు తూర్యములతో ప్రతిధ్వనించును, అశ్వహేషలు మారుమ్రోగును !" అత డిక మాటాడలేకపోయెను. భావావేగముతో నతడు వృద్ధ మంత్రిని గట్టిగా కౌగలించుకొని ఆనందాశ్రువులు

రాల్చెను. నిరాశయు నిశ్చేష్టతయు తిరోహితములైనవి. ప్రతాపుడు సైన్యమును సంగ్రహింప నారంభించెను.

౨౨

ప్రతాపుడు మొట్ట మొదట దేపీదుర్గము నాక్రమింప బోయెను. మొగలు సైనికులు శత్రువు విజితు డయ్యెనను భావముతో నిశ్శంకముగా ఉత్సవములందును వినోదము లందును మధుపానాదు లందును నిమగ్నులై యుండిరి. వారు యుద్ధ సన్నద్ధులు కాక విశ్రాంతి నొందుచుండిరి. అట్టి తరుణమున ప్రతాపు డాకస్మికముగా వారిపై బడెను. మొగలు సైన్యము చెల్లాచెదరైనది.

రాజపుత్రులు 'జయ జయ మహాదేవ' అని కేకలు పెట్టుచు దిక్కులు మారుమ్రోగునట్లు హుంకరించుచు చెలరేగిరి. వెంట వెంటనే ఖడ్గములు ధరించి ఎదుర్కొన్న మొగలు సైనికులు రాజపుత్రుల యీటెలకు గురి యైరి. తక్కినవారు తిరిగి చూడక పలాయితులైరి. కొంతమంది పలాయితులను పట్టుకొని రాజపుత్రులు నిహతుల జేసిరి. సాహాబాజఖాను పారిపోవువారిని మరలింప యత్నించి విఫలు డయ్యెను. చివరకు తాను గూడ పారిపోయెను.

ఈరీతి మరల యుద్ధములు ప్రారంభ మయ్యెను. ప్రతాపుని ఆనందమునకు పారములేదు. అత డింకను

మేవాడు విపినములందు దివారాత్రములు గ్రుమ్మరుచు సైన్యసంగ్రహము చేయుచుండెను. ఈసారి యతడు దీర్ఘ కాలము యుద్ధము చేయుటకు ఏర్పాట్లు చేయసాగెను. అతని ప్రయత్నములు విఫలములు కాలేదు. పరమేశ్వరు డీసారి అతనిపై దయార్ద్రదృష్టి ప్రసారించినాడు. అతడు మొగలు సైన్యము నాక్రమించిన ప్రదేశమందెల్ల శత్రువులు పరాజితు లగుచుండిరి. విజయములతో పాటు రాజపుత్ర సైన్యములు వృద్ధి నొందెను. ఉత్సాహమును ధైర్యసాహసములును విజృంభించినవి. రాజపుత్రు లీసారి అసాధ్యములను సాధింపసాగిరి.

ఈ వార్తలు దిల్లీకి చేరినవి. అక్బరు మనస్సు ఉద్విగ్నమైనది. పృథ్వీరాజు ముక్తకంఠముతో నిట్లు పలికెను: "పాదుషా! చూచితిరిగదా! ప్రతాపసింహు డెన్నటికిని తల యొగ్గ డని నేను చెప్పియుండలేదా! ఆ లేఖ రాజనీతివిధాన విశేషము! కాని వేరు కాదు." అక్బరు మిగుల చింతాన్వితుడయ్యెను. తరువాత నతడు మేవాడు మీదికి సైన్యము పంప నారంభించెను.

## ౨౩

ప్రతాపసింహుడు నిశ్చేష్టుడుగా లేడు. మొదట నతడు కొమలమీరు దుర్గము స్వాధీనపరచుకొనెను. ఇట్లు మొగలులను పారదోలి క్రమక్రమముగా నత డిరువది రెండు

దుర్గములు స్వాధీనము చేసికొనెను. పూర్వమే అతడు దీర్ఘకాల యుద్ధమునకు సంసిద్ధు డగుచుండెను. ఇపుడు దుర్గములను మరింత దృఢపరిచి దీర్ఘకాలమునకు సరిపోవు భోజనపదార్థములను గూడ సేకరించి శత్రువులను పారద్రోలుచుండెను.

ఒక్క సంవత్సరము లోపల ప్రతాపుడు మేవాడులో చాల భాగము వశము చేసికొని శత్రువులను తరిమి వేసెను. తరువాత మరి నాలుగువత్సరముల వరకు యుద్ధములుసాగెను. కాని చిత్తోడును అజ్మీరును మండల దుర్గమును మొగలుల యాధీనమందే యుండెను. ప్రతాపుడు వాని నిక ఉద్ధరింపలేక పోయెను. అయినను మేవాడులో నధికాంశము విపక్షహస్తములనుండి లాగికొన గలిగితిని గదా అని ఆశ్వస్తు డయ్యెను.

మేవాడు భాగ్య మతిశయించుచున్నను ఇట్టి సుఖదినములలో గూడ ప్రతాపునకు సంతోషము లేదు. ప్రాణతుల్యు డగు శాక్తసింహుడు, ప్రాణములచే కాపాడిన ఝూల్లా సర్దారు మొదలగు వీరపుంగవులను తలచుకొని అతడిట్లు చింతించుచుండెను : "ఆహా ! వారు జీవించియున్న నేడు నే నెంత సుఖ మనుభవించి యుందును ! సోదరు డగు శాక్తుడు మొదలైనవారు కేవలము కష్టములే అనుభవించిరి. కాని సౌఖ్యసుఖము చూడలేదు !"

ప్రతాపునకు మానసింహుని మీది క్రోధ మింకను తగ్గిపోలేదు. అందుల కతడు అంబరు రాజ్యములోని మాల

పురమును కొల్లగొట్టించెను. తరువాత నతడు ఉదయపురము నాక్రమించి నాలుగు మాసములలో స్వాధీన పరుచు కొనెను. ఈ సారి ప్రతాపుడు శాంతచిత్తముతో సింహాసన మధిరోహించెను.

ప్రతాపుని జయించుట అసంభవ మని అక్బరు తెలిసి కొనెను. శతగుణితములైన అతని ప్రయత్నము లన్నియు వ్యర్థము లయ్యెను. మరల హాల్దీఘట్టము మొదలగు చోట్ల యుద్ధములు చేయించుట విశేష నాశ జనకముగా కనబడెను. అంతియే కాక అంత సైన్యము పంపినను అంత ధనము వ్యయించినను ప్రతాపసింహుడు లొంగు నను నిశ్చయము లేదు. ప్రతాపు డెన్నడును పారతంత్ర్య మంగీకరింపడు!

దీర్ఘ కాలము యుద్ధములు చేయుటచేత మొగలు సైన్య మలసిపోయినది. సేనానాయకు లనేకులు హతులైరి. ఇట్టి యవస్థలో విస్తారము ధనము వెచ్చించుట గాని సైనిక దళములను బలి యిచ్చుట గాని సంగతము కాదని అక్బరు నిశ్చయించుకొనెను. తత్ఫలితముగా కొంత కాలము వరకు మేవాడులో యుద్ధములు సమసిపోయినవి. దేశములో నంతటను సుఖశాంతులు నెలకొన్నవి.

## ౨౪

ప్రతాపసింహుడు మరల ఉదయపురమును రాజధానిగా జేసికొనెను. అతడు మరల రాజయ్యె నని ప్రజ

లందరు ఆనందమున నోలలాడిరి. ప్రతాపుడు తన శపథ ములలో నొక దానిని నెరవేర్చెను. రెండవది చిత్తోడు సముద్ధరణము. అది సంభవింప లేదు. అందుకోస మతడు రాజ ప్రాసాదమున వసింపక రాజధాని బాహ్యప్రదేశమున ఉదయ సాగర తీరమందు కుటీరము నిర్మించి అందు నివసించెను.

అత్యంత పరిశ్రమము వలన అతని స్వాస్థ్యము చెడినది. దాని పైన చిత్తోడు జయింపలేక పోయితినే అనెడి విచార మతనిని మరింత క్రుంగ జేసినది.

ప్రతాపుడు మృత్యువాసన్న మగుట తెలిసికొని జ్యేష్ఠ పుత్రుడగు అమరసింహుని సర్దారులను రావించెను. మొదట నతడు అమరునితో నిట్లనెను : "కుమారా! నా జీవితలక్ష్య మగు మేవాడును నీ హస్తములందుంచి నేను పోవుచున్నాను. మేవాడు రాజ్య గౌరవమును రాణా కుల గౌరవమును రాజ పుత్ర జాతి గౌరవమును నీవు కాపాడవలయును. నేడు మన పూర్వపురుషుల పవిత్ర నామములు స్మరించి, రాజపుత్రస్థాన రాజలక్ష్మిని పరమేశ్వరు డగు ఏకలింగేశ్వరుని ధ్యానించి, నన్నును నా ఖడ్గమును స్పృశించి, 'నా శరీరములో నొక్క రక్తబిందు వున్నంతవరకు మేవాడును మొగలుల వశము కానీయను – తురుష్కుల కెన్నడును తలయొగ్గను' అని శపథము చేయుము !"

అమరసింహు డట్లే ప్రతిజ్ఞ చేసెను. కాని ప్రతాపునకు అమరుని ప్రతిజ్ఞపై విశ్వాసము కలుగలేదు. అందుచే

నతడు మాటి మాటికిని సర్దారుల ముఖములవంక చూడ సాగెను. అది గమనించి సర్దారు సాలుంబ్రా ఇట్లనెను: "మహారాణా! తమ ముఖమున నింకను విచారచిహ్నము కనిపించుచున్నది! విప్పి చెప్పుడు. మే మందరము మా ప్రాణము లర్పించియైనను తమ కోరిక నెరవేర్చెదము."

ప్రతాపుడు మెల్లమెల్లగా నిట్లు పలికెను: "అమరుడు విలాసప్రియుడు, అసహిష్ణువు. అతడు మేవాడు స్వాతంత్ర్యము రక్షింపగల డను ధైర్యము కలుగుట లేదు."

ప్రతాపుడు రెండు మూడు పర్యాయము లట్లు పలికెను. అప్పుడు సాలుంబ్రా మొదలగు సామంతు లందరును ప్రతాపుని ఖడ్గము స్పృశించి యిట్లు ప్రమాణము చేసిరి: "మహారాణా! మే మందరమును మా కంఠములో ప్రాణము లున్నంతవరకు మన ప్రియమైన మేవాడును — తమ గౌరవ భూమి యగు మేవాడును మొగలుల హస్తగతము చేయుము. మేము సర్వదా యువరాజగు అమరసింహుని పార్శ్వమం దుండి రక్షించెదము!"

సామంతుల పలుకులు వినినంతనే ప్రతాపుని ముఖ మండల ముజ్జ్వల మయ్యెను. అతడు సంతుష్టి సూచకముగా మందహాసము చేసెను. పరక్షణమున నా రాజర్షి సత్తముని వదన బింబమునుండి దివ్యతేజస్సు బయలువెడలి సప్తర్షి మండలమున లీన మయ్యెను.

ఇతి శ్రీః